

శ్రీ గుమ్మిట వెంకటరెడ్డి గారు

(ఇరిగేషన్ డిపార్ట్‌మెంట్, అసిస్టెంట్ ఇంజనీరింగ్)

శ్రీమతి గుమ్మిట రామలక్ష్మి గారు

నంధ్యాల

# భారతీయ ధర్మం

## ప్రతి ఒక్కరూ తెలుసుకోవల్సిన ధర్మం




సంకలన కర్త:

**శ్రీశ్రీశ్రీ స్వామి సుగుణనంద**

## ముందు మాట



భారతీయ ధర్మం మరిచిపోయి విదేశీ ధర్మాలకి అలవాటు అవుతున్నారు మన భారతీయులు. ఇలాంటి సమయంలో శ్రీ సుగుణానంద స్వామిగారు భారతీయ ధర్మం అని ఈ పుస్తకం వ్రాయడం నాకు చాలా ఆనందంగా ఉంది. మన భారతీయ ధర్మాన్ని అందరికీ అందజేయాలన్న వారి సంకల్పం సిద్ధించాలని ఆశీర్వదిస్తున్నాను.

ఈ పుస్తకంలో నవభారత నిర్మాణం 16 సంస్కారాలు 4 ఆశ్రమ ధర్మాలు చాలా బాగా వివరించారు. నవభారత నిర్మాణాన్ని నిజంగా మనం పాటించినట్లయితే నూతన భారతదేశాన్ని మనం చూడగలుగుతాము. అలాగే గృహస్థ ధర్మం ఒక్క గొప్పతనం చాలా గొప్పగా వ్రాశారు. వారు ఇలాంటి పుస్తకాలు మరెన్నో వ్రాయాలని కోరుతూ నేను నిత్యము కొలిచే ఏడుకొండల వేంకటేశ్వర స్వామి ఆశీస్సులు ఎల్లవేళలా ఉండాలని శ్రీ వేంకటేశ్వర స్వామిని వేడుకుంటున్నాను.

ఇట్లు

**శ్రీమాన్ శ్రీ తాళ్ళపాక హరినారాయణ స్వామి**

అన్నమయ్య స్వామి వారి

12వ వంశీకులు - తిరుమల

## ముందు మాట



శ్రీ సుగుణానంద స్వామి వారు వ్రాసిన "భారతీయ ధర్మం" పుస్తకము భారత దేశానికి ఒక జ్యోతిలా వెలిగి మరుగై మసకబారిన సనాతన ధర్మాన్ని వెలుగులోకి తెచ్చి మానవాళికి మళ్లీ పరిచయం చేస్తున్న ఈ గొప్ప కార్యం సఫలం కావాలని ఆ భగవంతునిని ప్రార్థిస్తున్నాను. "భారతీయ ధర్మం" ఈ పుస్తకాన్ని నేను చదివాను. భరతదేశ పూర్వ వైభవం గుర్తుకు వచ్చింది. మేము విదేశీయులము అయిన మా పూర్వీకులు భారతీయులే భరతదేశం మీద గౌరవంతో ప్రతి సంవత్సరం వస్తుంటాను. భారతదేశం మీద గౌరవంతోనే సన్యాసం స్వీకరించాను. ఇక్కడ సంప్రదాయాలు, సంస్కృతం, యోగులు, వేదాలు, శాస్త్రాలు అంటే మాకు చాలా ఇష్టం. నవంబర్, 2016లో మేము భారతదేశం వచ్చినప్పుడు మా మిత్రులు మార్త, సత్యనారాయణ, కొండగట్టు శబరి వనాశ్రమములో ఉన్నాము. అక్కడికి శ్రీ సుగుణానంద స్వామి గారు వచ్చారు. సత్యనారాయణ స్వామీజీని పరిచయం చేసారు. వీరు ప్రతి సంవత్సరానికి 3 నుండి 6 నెలలు హిమాలయాలలో ఉంటారు. మంచి సాధకులు అని పరిచయం - చేసారు. నేను స్వామీజీ మాట్లాడుకుంటున్నాము. స్వామీజీ చేతిలో డి.టి.పి. చేసిన ఈ పుస్తకం ఉంది. స్వామీజీ మా చేతికి ఇచ్చి ఇది ఒకసారి చదవండి అని చెప్పారు. నేను సత్యనారాయణ గారిని చదవమని చెప్పాను. వారు చదువుతుంటే చాలా ఆనందంగా అనిపించింది. గురు ప్రార్థన, 16 సంస్కారాలు, నవభారత నిర్మాణము, యజ్ఞాల గురించి చాలా బాగా వ్రాశారు. నేను భారతదేశానికి ఏదో జ్ఞానం కావాలి అని వస్తున్నాను. ఆ జ్ఞానం దొరికింది అనిపించింది. 16 సంస్కారాలు మనం పాటించినట్లయితే నిజమైన నవభారత నిర్మాణము జరుగుతుంది. భారతదేశ భవిష్యత్తుని దృష్టిలో పెట్టుకొని ఈ పుస్తకం వ్రాసినందుకు అభినందిస్తూ ఆశీర్వదిస్తున్నాను.

ఇట్లు

**శ్రీశ్రీశ్రీ స్వామి సత్య కామనంద సరస్వతి**

పీఠాధిపతులు, పరమేశ్వరీ ఆనంద నిలయం ఆశ్రమము

బ్యూ క్లైమేట్, న్యూవెల్లి, ఫ్రాన్స్, మారిషస్,

00230-6178543, 00230-59451743.

# సందేశము



శ్రీ సుగుణానంద స్వామి వారు వ్రాసిన "భారతీయ ధర్మం" నూతన ధర్మాన్ని నిలబెట్టే ఒక యజ్ఞం తలపెట్టినట్లుంది. నశించే ధర్మాన్ని క్రొత్త హంగులతో మానవ లోకానికి అందించుటకు చేసే ఈ ప్రయత్నం అమోఘం, ఆనందం, చిన్న వయస్సయినా వయస్సుకు మించిన అనుభవంతో "భారతీయ ధర్మం" అనే ఈ అమూల్య గ్రంథం మనకు అందించడం భారతీయులు చేసుకున్న పూర్వజన్మల సుకృతంగా భావించుచున్నాను.

శ్రీ సుగుణానంద స్వామి వారు తన ఇతర రచనలలో తన అనేక ఆశ్రమాల సందర్శన, హిమాలయాలలోని గుహలలో ధ్యాన సాధన, మానవాళి హితానికై అన్వేషణ మొదలగు అనుభవాలను గమనంచినట్లయితే తన జీవిత పరమార్థం మానవాళి ఉద్ధరణే అని అవగతమవుతుంది. తను నిత్య అన్వేషిగా చెప్పకనే చెప్పుచున్నారు. ఏదేమైనా స్వామిగారి ఈ ప్రయత్నం భారతీయ సాంప్రదాయాన్ని తట్టి లేపినట్లుంది.

"స్వస్తి"

ఇట్లు

**మార్త సత్యనారాయణ**
(Retd. B.C. Welfare Officer MA)
అయ్యప్ప ఉపాసకులు, గురుస్వామి
శబరివనం ఆశ్రమం, కొండగట్టు, జగిత్యాల జిల్లా.
సెల్ : 96189 60603.

# విషయ సూచిక

# అంకితం

మన మానవ జన్మకి మొదటి బంధము ఆశ, చివరి బంధము గురువు. అజ్ఞానాన్ని తొలగించి జ్ఞానాన్ని పెంపొందించే నా గురువు దేవులు, భగవాన్ శ్రీ రమణ మహర్షి గారు. సూక్ష్మ శరీరధారణతో నాకు జ్ఞానబోద చేస్తున్న పరమాత్మ స్వరూపులు వారి పాదపద్మములకి ఈ పుస్తకం అంకితం చేస్తున్నాను.



శ్రీ ఆదిశంకరాచార్యులు గారు



భగవాన్ శ్రీ రమణ మహర్షి గారు



శ్రీ అక్క మహాదేవి గారు

# గురు ప్రార్థన

ఓ గురుదేవా సమయం గడిచిపోతుంది. జీవితం మళ్లీ రానంటుంది. అడుగు వేయలేని బంధము, చాలీచాలని జ్ఞానం ఏదో అర్థంకాని తపన నన్ను నిలువునా ముంచేసే ఆశలు, కలలు కంటూ, రాగద్వేషాలతో నిండిపోతున్న గమ్యం అంటే ఏమిటి?.

ఆశల కోసమేనా, భక్తి, ముక్తి కోసం కాదే! ముక్తి అనే తపన ఎక్కడుంది అని నా మనస్సును ప్రశ్నిస్తే జవాబు రాదే. సమయం గడిచిపోతుంది. మాయకు బానిసనై పోతున్నాను. మాయతో ఉంటూ, మాయను ఎలా జయించాలిరా, ఈశ్వరా!

పరమాత్ముని కొరకు తపన పడుతున్న, తల్లడిల్లుతున్న సమయంలో నన్ను నిద్రలేపి, అక్షరజ్ఞానంలేని నాకు ఆధ్యాత్మిక జ్ఞానాన్ని అందించారు. హిమగిరి శిఖరం ఎక్కించారు. ఎందరో మహర్షులు, యోగులు కలిసే అవకాశాన్ని కల్పించారు. ఇంత జ్ఞానాన్ని అందించినా నా గురుదేవులు పరమాత్మ స్వరూపులు ఎన్ని జన్మలు ఎత్తినా వారి రుణం తీర్చుకోలేనిది. మీ పాదాల ధూళిని నా నుదుట విభూది రేఖలు రాసుకొని నిత్యం మీ నామ స్మరణతో ఈ నా జన్మ మీ పాదాలకి అంకితం చేస్తున్నాను.

అలాగే కేదార్‌నాథ్‌లో బ్రహ్మ గృహవద్ద దర్శనం ఇచ్చి ఆధ్యాత్మిక దారిలో నాకు తోడు ఉంటున్న గురు సమానులైన మాత రేణుకగారి పాదపద్మములకు నా హృదయ పుష్పాలను అర్పిస్తున్నాను.

ఇట్లు

**ఓ సత్య అన్వేషి**

# నా మాట

మన భారతదేశంలో ఉన్న వారందరిదీ ఋషి సాంప్రదాయం. అలాంటి మనకి ఇప్పుడు మన సాంప్రదాయం తెలియదు. మన భారతీయ సాంప్రదాయం మారువున పడిపోయింది. ఎందువల్ల అంటే మన భారతదేశాన్ని బ్రిటీషు వారు 200 సంవత్సరాలు పరిపాలించారు. బ్రిటీషు వారు మన భారత దేశానికి వచ్చిన తరువాత వారు చేసిన మొట్టమొదటి పని మన వేద పాఠశాలలు తీసివేసి వారి ఇంగ్లీషు స్కూళ్ళు స్థాపించారు. అలాగే మన సాంప్రదాయాలను, మన మనోభావాలను దెబ్బతీశారు. ఎదిరించే శక్తిలేక బానిసలుగా బ్రతికాము. మన భారతీయుల కళ్ళ ముందే మన గ్రంథాలయాలను కాల్చివేశారు. మన పూర్వీకులు అందించిన జ్ఞానాన్ని అగ్నికి ఆహుతి చేశారు. కాశీలోని గ్రంథాలయము 2 నెలలు కాలుతూనే ఉన్నది. అంటే అందులో ఎన్ని గ్రంథాలు ఉండి వుంటాయి. మన భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానాన్ని, సాంప్రదాయాలను కోల్పోయేలా చేశారు. లేకపోతే ఈరోజు ప్రపంచంలోనే మనదేశం ముందు వుండేది. ఎలా అని నన్ను ప్రశ్నించవచ్చు. మన భారతదేశంలో జన్మించిన ఒక్కొక్క మహర్షి 100 మంది సైంటిస్టులతో సమానం. ఉదాహరణకి మహర్షుల పేర్లు చెబుతున్నాను.

**అగస్త్య మహర్షి :** ఈనాటి వాతావరణాన్ని దృష్టిలో పెట్టుకొని ఆరోజే మనకి వాతావరణం కాపాడుకొనే విధానం అందించారు. పూర్తి వివరణ 16 సంస్కారాలతో రాశాను.

**చెరక మహర్షి :** కేదార్‌నాథ్‌లో పరిశోధన చేసి ఆయుర్వేద శాస్త్రం మనకు అందించారు. ఈనాటి సైన్స్ కన్నా అడ్వాన్స్‌గా అందించారు. ఈనాటి సైన్స్ ద్వారా గ్రహాలు వున్నాయి అని కనుక్కొని రాకెట్ ద్వారా గ్రహాలలోకి వెళుతున్నారు. వేల సంవత్సరాల క్రితమే **జెమిని మహర్షి** మరియు ఇంకొందరు మహర్షులు కలిసి గ్రహాలమీద పరిశోధన చేసి గ్రహాలు వున్నాయి అని, గ్రహాల ప్రబావం మానవుని మీద ఏవిధంగా ఫలితాలు ఇస్తున్నాయి అని పరిశీలించి జ్యోతిష్య శాస్త్రాన్ని రచించి మనకు అందించారు. భూమికి ఆకర్షణ శక్తి వుందని న్యూటన్ సైంటిఫిక్‌గా నిర్ధారించాడు. వేల సంవత్సరాల క్రితమే భూమికి ఆకర్షణ శక్తి ఉందని తెలిసి మహర్షులు ధ్యానం చేసేటప్పుడు జింక చర్మము, పులి చర్మము వేసుకొని ధ్యానం చేసేవారు. ఈరోజు ప్రపంచం మొత్తం యోగా చేస్తున్నారు. **పతంజలి మహర్షి** 2 వేల సంవత్సరాల క్రితమే ఈరోజు జరగబోయేది దృష్టిలో పెట్టుకొని

యోగశాస్త్రాన్ని రచించాడు. ఈరోజు సైన్స్‌కి అందని విధంగా మనకి రచించి ఇచ్చాడు. ఏ విధంగా అని నన్ను ప్రశ్నించ వచ్చు. ఈనాటి సైన్స్ మొత్తం పరికరాలపై ఆధారపడి ఉంది. ఎలా అంటే ఈరో జు ఒక స్త్రీ గర్భధారణ చెందిందా! లేదా! అని తెలుసుకోవాలంటే ప్రెగ్నెన్స్ కిట్ తీసుకువచ్చి స్త్రీ యూరిన్ ఒక్క డ్రాప్ వేస్తారు. మూడు ఎర్రగీతలు వస్తే ప్రెగ్నెన్స్ కన్‌ఫార్మ్ లేకపోతే రెండు ఎర్రగీతలు వస్తే ప్రెగ్నెన్స్ కాలేదు అని నిర్ధారిస్తారు. మన భారతీయ యోగశాస్త్రంలో స్త్రీ చెయ్యి నాడి పట్టుకొని ప్రెగ్నెన్స్ అవునా, కాదా అని చెబుతారు. ఇలా మహర్షుల వివరణ తెలుపుకుంటూ పోతే గ్రంథాలు సరిపోవు. ఇంతటి జ్ఞానాన్ని బ్రిటీషు వారు వచ్చి వారి పరిపాలనలో 200 సంవత్సరాలు గడిచిపోయాయంటే రెండు, మూడు తరాలు గడిచిపోయినట్లు. ఉన్న గ్రంథాలను దహనం చేశారు. అక్కడక్కడ దొరికిన గ్రంథాల ద్వారా మన వేదాలు, ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్రాలు, భగవద్గీత మళ్ళీ మనకు అందించే ప్రయత్నం చేస్తున్నారు. కానీ మనం విదేశీ సాంప్రదాయాలకు అలవాటు పడిపోయాము. కాబట్టి మన సాంప్రదాయాలను మనం పట్టించుకోవడం లేదు. మన సాంప్రదాయం ప్రపంచంలోని ఉన్నతమైన సాంప్రదాయం మనది. ప్రపంచంలోని మన భారతదేశాన్ని ఆధ్యాత్మిక జ్ఞానపీఠం అంటారు. ఈరోజు కూడా దేశవిదేశీయులు మన భారతదేశానికి వచ్చి ఆధ్యాత్మిక జ్ఞానాన్ని స్వీకరిస్తున్నారు. ఋషికేష్‌లో, హిమాచల్‌ప్రదేశ్‌లో, కన్యాకుమారిలో, కాశీలో, పుట్టపర్తి సాయిబాబా, జగ్గి వాసుదేవ్, రవిశంకర్, రామ్‌దేవ్ బాబా, స్వామి దయానంద మొదలైన వారిని చూసినట్లయితే విదేశీయులు ఆధ్యాత్మిక జ్ఞానం కోసం ఇప్పటికీ తిరుగుతూనే ఉన్నారు. ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్నో చరిత్రలు ఉన్నాయి. కానీ ఇప్పుడు మన సాంప్రదాయాన్ని మన 16 సంస్కారాలని మళ్ళీ మనం ప్రారంభిస్తాము, పాటిస్తాము, పాటించి బ్రహ్మజ్ఞానులకు జన్మనిద్దాము. మన సాంప్రదాయాలను కాపాడుకుందాం. ఈ పుస్తకాన్ని చదివి ఏ ఒక్కరైనా 16 సంస్కారాలు పాటించినా, సంసార నియమాలు పాటించినా మా యొక్క ఈ చిన్ని ప్రయత్నానికి ఫలితం లభించినట్లే.

మీ

**ఆత్మీయులు**

**శ్రీశ్రీశ్రీ స్వామి సుగుణానంద**

# నవభారత నిర్మాణం

నూతన శరీరాన్ని ధరించే ఆత్మ కొన్ని పాత సంస్కారాలను తీసుకు వస్తుంది. ఈ సంస్కారాలు దాని కారణ శరీరం లేక సూక్ష్మ శరీరం ఆత్మయొక్క ఈ జన్మలోని మన స్థూల శరీరాన్ని నిర్మిస్తుంది. ఈ కారణ లేక సూక్ష్మ శరీరములో వెనుకటి జన్మల చెడు సంస్కారాలు కూడా వస్తున్నట్లయితే మనం ఆత్మ స్థూల శరీర రూపం ధరించకముందే ఆ సూక్ష్మ చెడు సంస్కారాల మీద దెబ్బ వేయకపోతే, వాటిని మార్చే ప్రయత్నం చేయక పోతే ఆ సంస్కారాలు ఎలాంటివో అలాంటి మానవుడే పుడతాడు. వైదిక ధర్మం ప్రకారం నూతన మానవ నిర్మాణాలు చేయటానికి మానవుడు పుట్టక ముందే తల్లి కడుపులో వున్నప్పుడే అతని సంస్కారాలు శరీరంలో ఉన్నప్పుడే, ఆ శరీరమే ఈ జన్మకు కారణమైన దాని సూక్ష్మశరీరం అంటున్నామో - నవ మానవుణ్ని కనాలనే స్త్రీ పురుషులు తమ స్వభావాల తీవ్రత, బలంచేత కొత్త సంస్కారాలు వేయటానికి ప్రయత్నిస్తారు. నవమానవుని పుట్టుక తల్లిదండ్రుల రజస్సు, వీర్యములతో కలుగుతుంది. ఈ రజోవీర్యములే నవమానవుని సూక్ష్మ శరీరము, కారణ శరీరమునకు ఆధారమవుతాయి. తల్లిదండ్రుల ఆలోచనలు ఎలాంటివో వారి రజోవీర్యములు అలాంటి ఆలోచనలు, స్వభావం కలిగిన సూక్ష్మశరీరం గల ఆత్మను తమవైపు ఆకర్షిస్తుంది. పవిత్ర భావాలు గల తల్లిదండ్రుల రజోవీర్యముల వైపు సంస్కారాల శరీరము, సూక్ష్మ, కారణ శరీరము ఆకర్షితమవుతుందో, అది పుట్టకముందే అతని పూర్వ సంస్కారాలు, అభిరుచులు, స్వభావాలు, అలవాట్ల పైన తల్లిదండ్రుల ద్వారా రజోవీర్యముపైన సంస్కారాల దెబ్బ (ప్రభావం) పడుతుంది. దానిచేత పుట్టిన తరువాత మానవుని జీవిత గమనం, దిశ, దిక్కు సన్మార్గాన పడుతుంది. అతనిలో పూర్వ సంస్కారాలు కొద్దిగా ఉన్నప్పటికీ, తల్లిదండ్రుల శుద్ధ సంస్కారాల వలన నూతన మార్గంవైపు లాగబడతాడు. ఇప్పుడిక్కడ ప్రశ్న కలుగుతుంది – ఆలోచనలకు అంత బలం ఉంటుందా? అవి తిన్నగా రజోవీర్యములను ప్రభావితం చేసి నూతన జన్మను ధరించే జీవుని పాత సంస్కారాలను మార్చగలవా? వైదిక సంస్కృతి తత్వవేత్తలు ఇలాగే భావిస్తారు. అందుకనే వారు నూతన జన్మధారణ చేసే జీవుని సంస్కారాల పరిధి చక్రంలోకి దింపుతారు. వారి విశ్వాసం ప్రకారం ఎలా విత్తనం లోపల దాని నిర్మాణంలో మార్పుచేస్తే మంచి మొలక వస్తుందో, అలాగే ఆత్మ జన్మించక ముందే దాని సూక్ష్మ, కారణ, సంస్కార శరీరంలో

తల్లిదండ్రుల శక్తివంతమైన, వేగము గల స్వభావంచేత రజోవీర్యములు సాధనంగా మార్పు చేయవచ్చును. అతడు మాతృ గర్భములో 9 నెలల వుంటాడు. ఆమె ప్రతి అవయవము నుండి ప్రాణశక్తిని తీసుకుంటాడు. ఆమె హృదయంతో అతని హృదయం, ఆమె మెదడుతో అతని మెదడు తయారవుతుంది. ఆ తల్లిని సాధనంగా చేసుకొని పాత సంస్కారాలు మార్పు చేయవచ్చును. చెడు ఆలోచనలు ఉంటే వాటిని శక్తిహీనం చేయవచ్చును. ఒక కొత్త మానవుని సృష్టించవచ్చును. అందుకనే ఏ సంస్కృతి నలువైపుల కర్మల వలలో చిక్కుకొని ఉన్నదో, అదే సంస్కృతి చెపుతున్నది – సంస్కారాల ప్రభావితుణ్ణి చేయవచ్చును. తద్వారా ప్రపంచంలో ఒక కొత్త తరాన్ని సృష్టించ వచ్చును. నవమానవ నిర్మాణంలో వైదిక సంస్కృతి రెండు రకాలుగా ప్రయత్నించింది. బాలుడు పుట్టక ముందు మనం అనుకున్నట్లు చేయగలము. దీనికి ఉపాయము – తల్లిదండ్రులు గర్భస్థ శిశువును ఆహ్వానించే ముందు తమ భావాలను బలీయం చేసుకోవాలి. తల్లిదండ్రుల మనోభావాలు ఎలా వుంటాయో అలాంటి స్వభావం గల కారణ, సూక్ష్మ శరీరం వారి వైపు లాగబడుతుంది. నవమానవ నిర్మాణానికి ఇది మొదటి ప్రయత్నం. దీనికి ఆధారం వంశము రెండవ ప్రయత్నం అతనికి సక్రమ వికాసం కలిగే విధంగా పరిశుభ్ర వాతావరణంలో ఉంచడం, దానికొరకు ఇతర అనేక సంస్కారాలు కల్పించారు. వైదిక సంస్కృతి కర్మల వ్రాతను (అదృష్టము) ఛేదించరాని కోట అనుకొని జన్మ జన్మాంతరము వరకు దానిలోనుంచి వ్యక్తి బయటకు రాలేదనుకోవటం, నొసటి రాతను బట్టి తిట్టుకుంటూ కూర్చోవడమేనను కోవడం ఆత్మను అపార్థం చేసుకోవడమే. కర్మల గోడను వైదిక సంస్కృతి ఛేదించరాని గోడ అనుకుంటే – ఇంకా ఒక కర్మను అనుభవించనంత వరకు ముందుకు అడుగు వేయటానికి వీలుపడదని భావించితే సంస్కారాల పద్ధతిని అమలుపరచే వారే కాదు. కర్మలు అనుభవించబడతవి, కానీ సంస్కారాల రూపంలో. ఇందువలన సంస్కారాల ద్వారా వాటిని మార్చవచ్చును కూడ. మనం మార్చే సంస్కారాలు పుట్టబోయే ఆత్మ యొక్క పుట్టిన ఆత్మయొక్క పూర్వజన్మ సంస్కారాలను, తల్లిదండ్రుల నుంచి వచ్చిన వంశపారంపర్య సంస్కారాలను, పర్యావరణ ద్వారా వచ్చే సంస్కారాలను, నవమానవ నిర్మాణానికి అవసరమైన సంస్కారాలను మార్చవచ్చును. తల్లిదండ్రుల సంస్కారాలు కూడా ఒక దీర్ఘమైన వలయంలో పడి తయారవుతాయి. వారు అనేక కర్మలు చేశారు. మంచివి చేశారు,

చెదుని చేశారు. వాటి అన్నింటివలన వారి సంస్కారాలు తయారైనవి. వారి ఇష్టము ఏర్పడింది. వ్యాపారము (చొరవ) ఏర్పడింది. జీవిత గమన మార్గము ఏర్పడింది. సంస్కార పద్ధతి ద్వారా తల్లిదండ్రుల నుండి కోరేది ఏమిటి? వారు ఎప్పుడైనా కొత్త జీవిని ఆహ్వానించ దలచితే తమ సంస్కారాలను బలమైనవిగాను, శక్తివంతమైనవిగాను చేసుకోవాలి. తమ సంతానాన్ని తమ సంస్కారాల ద్వారా ప్రభావితం చేయగలగాలి. ఒక వ్యక్తి తన వ్యాపారం చొరవ ద్వారా రెండవదాని జీవిత పోకడను, తన ఇష్టంతో రెండవవాని ఇష్టాన్ని, తమ మార్గాన్ని అనుసరించి రెండవదాని మార్గాన్ని, తన సంస్కారాల వలన ఇతరుల సంస్కారాలను మార్చ గలడు. ఇందులోనే సంస్కార పద్ధతి ద్వారా మానవుని నవనిర్మాణ రహస్యం ఇమిడియుంది.

పైన మేము ఇంత విస్తారంగా వ్రాయవలసిన అవసరం ఎందుకు కలిగిందంటే, మనం పునర్జన్మను ఒప్పుకుంటాము. ఆత్మ జన్మజన్మాంతరాల కర్మల బరువును మోస్తూ తిరుగుతుందని అనుకుంటాము. ఇందువలన అనేక జన్మల కర్మలను ఈ ఒక్కజన్మ సంస్కారాల వలన ఎలా ప్రభావితం చేయగలము? మార్చగలము? ఈ సందేహానికి సమాధానం కావాలిగదా! ఇందువలననే ఇదంతా వ్రాయవలసిన అవసరం వచ్చింది. ఇంకొక జన్మ జన్మాంతరము ఇన్ని కర్మలు, ఈ అన్ని కర్మల ఫలాన్ని ఎలా అనుభవిస్తారు? ఇది కూడా ఒక సమస్యే కదా! దీనికి సమాధానం కావాలి. ఇక కర్మ సిద్ధాంతం మానవుని కట్టివేస్తుంది. అతనిని స్వతంత్రంగా ఉండనీయదు. సంస్కారాల సిద్ధాంతం మానవునకు స్వతంత్రతనిస్తుంది. సంస్కారాల వలన మానవుడు జన్మజన్మాంతరముల నుండి కూడుకున్న సంస్కారాలను మార్చగలడు. ఈ అన్ని సమస్యలకు సమాధానము అవసరం. వీటన్నింటినీ దృష్టిలో పెట్టుకొని సంస్కారాలను గురించి తత్త్వ దృష్టితో విమర్శ చేయవలసిన అవసరం వచ్చింది. కానీ ఆత్మకు జన్మజన్మాంతరములు లేవని, కర్మల చిక్కు ఏమీ ఉండదని, ఈ జన్మ ఒక్కటే, రెండవ జన్మలేదని, ఈ జన్మలోనే మనం మొదలుపెడతాము. దీనిలోనే పూర్తిచేస్తాము అని అనుకునే వారికి ఈ సమస్య అంతా అతి సరళమైనది. వారి సమస్య కేవలం తల్లిదండ్రుల సంస్కారాలు వంశపారం పర్యంగా వచ్చేవాటిని గ్రహిస్తాడు. జన్మించిన తరువాత ఎలాంటి సంఘ వాతావరణంలో పెరుగుతాడో వాటినే గ్రహిస్తాడు. తల్లిదండ్రుల సంస్కారాలు ఎలా ఉంటే, అలాంటి పరిస్థితిలో

పిల్లలనుంచటంచేత అలాంటి వారుగా తయారవుతారు. ఇలాంటి వారికి ఈ సమస్య చాలా సరళము. ఈ సరళత వలననే వారి దృష్టి నవమానవ నిర్మాణంవైపు పోదు. పోయినా వారి దృష్టి భౌతిక పరిస్థితుల మార్పుపైనే ఉంటుంది. కర్మను జన్మజన్మాంతరాల ఒప్పుకునే వైదిక సంస్కృతికి ఇది ఒక విషమ సమస్య, కర్మ ఒక పెద్ద అవరోధము. దాని వలన మానవ సమాజం ఒక అడుగు కూడా ముందుకు పోలేదు. ఈ ఆటంకాన్ని చూచే వైదిక సంస్కృతియొక్క జ్ఞానము, నవమానవ నిర్మాణం కొరకు ఒక కొత్త ఆలోచన కనిపెట్టింది. సంస్కారాల పద్ధతిని ప్రవేశపెట్టింది. దాని ఉద్దేశ్యం ప్రకారం మానవ సమాజాన్ని నిరంతరం మారుస్తూ మారుస్తూ ఉన్నత స్థాయికి తీసుకెళ్లడము. సమాజ నవనిర్మాణానికి నవసమాజాన్ని నిర్మించాలి. ఒక్కొక్క మనిషి మారినపుడే సమాజం మారుతుంది. ఒక్కో మనిషి మారేదెప్పుడు? అతని నిర్మాణానికి ఒక నూతన రూపురేఖల చిత్రాన్ని నిర్మించుకోవాలి. పటాన్ని, చిత్రాన్ని ఎదురుగా ఉంచుకొని అతని నిర్మాణం జరగాలి. ఇంటివి నిర్మించ బోయే ముందు దాని పటము, నమూనా గీస్తాము. ఒక్కో ఇటుకరాయిని దానిని బట్టి ఎన్నుకుంటారు, నిర్మిస్తారు. అలాగే మొదట మానవుని రూపు రేఖలు గీయాలి. ఆ రూపురేఖలను బట్టి అతని నిర్మాణం జరుగుతుంది. అలాంటి నూతన మానవులు తయారైనప్పుడు నూతన ప్రపంచం ఏర్పడుతుంది. ఈ ప్రణాళిక ప్రకారం పుట్టే మనుష్యులు కొత్త మనుష్యులు అవుతారు. ఇంత వరకు ప్రపంచంలో ఎన్ని సంస్కృతులు పుట్టినవో, వాటిలో వైదిక సంస్కృతి దిశానిర్దేశము చేసిన వారు నూతన మానవుని రూపాంతరణ కలను కన్నారు. ఆ రూపాంతరణ రూపమే సంస్కార పద్ధతిగా రూపుదాల్చింది.

18వ శతాబ్దంలో ఈ దేశంలో అనేకమంది మహా మానవులు జన్మించి వందలకొలది సంవత్సరాల నుండి చీకటిలో పడివున్న ఈ దేశ దురదృష్టాన్ని మార్చివేశారు. వారిలో శీర్ష స్థానంలో దయానంద మహర్షిని పేర్కొన వచ్చును.

ఋషి దయానందుడు చూపిన ఆలోచనా మార్గాన్ని వైదిక సంస్కృతి పునరుద్ధరణమంటారు. ఈ వరుసలో ఆయన 'సంస్కార విధి' అనే గ్రంథాన్ని రచించాడు. దాని ఉద్దేశ్యము నవమానవ నిర్మాణ ప్రణాళికను అమలు పరచడమే. ఈ గ్రంథంలో నవమానవ నిర్మాణం కొరకై 16 సంస్కారాలు శాస్త్రీయంగా వర్ణించబడినవి. ఇవి దయానందుడు తాను కనిపెట్టినవి కావు. వైదిక గ్రంథాల ఆధారంగానే ఆయన 'సంస్కార

విధి' గ్రంథాన్ని రచించాడు. ఈ సంస్కారాల వలన మానవుని నిర్మాణం ఎలా సాధ్యమవుతుందో స్పష్టం చేయడమే ఈ గ్రంథం యొక్క ముఖ్య ఉద్దేశ్యము.

సంస్కార పద్ధతి యొక్క కల మానవుని రూపాంతరమే కాదు, మానవుని రూపాంతరణము ద్వారా ప్రతి 20 సంవత్సరాల తరువాత కాలాన్ని మార్చడమే. ఇవాళ పుట్టే పిల్లలు 20 సంవత్సరాల తర్వాత యువకులు అవుతారు. పాత తరం స్థానాన్ని వారే ఆక్రమిస్తారు. వారు ఎలా తయారవుతారో అలా కాలం, యుగం తయారవుతుంది. తల్లిదండ్రులు, సమాజం యొక్క ఆలోచనలను మార్చి హిట్లరు 20 సంవత్సరాలలో ఎవరూ ఊహించని యువతరాన్ని నిర్మించాడు జర్మనీలో ఈ మూల నుంచి ఆ మూలదాకా తరంగములు అలలుగా ప్రవహించిన ఆలోచనలు, సంస్కారముల యొక్క మూర్తీభవించిన రూపమే ఈ నవతరము. మనము ఏ రకం యువకులను తయారుచేయాలను కుంటున్నామో, 20 సంవత్సరాల తరువాత వారే సమాజానికి కర్తలు, సర్వస్వము అవుతారు. సంస్కార పద్ధతి రహస్యాన్ని తెలుసుకొని ప్రతి తల్లిదండ్రులు ప్రతిజ్ఞాపూర్వకంగా తమ సంతానాన్ని ఈ సంస్కారాల ద్వారా తీర్చిదిద్దితే వారు తమకంటే ఉన్నత స్థితికి చేరుకుంటారు. ప్రతి 20 సంవత్స రాల తరువాత ఒక కొత్తతరం తయారవుతుంది. ఒక కొత్త యుగారంభమవు తుంది.

ఈనాడు తల్లిదండ్రుల పతనదశను సూచించే దుర అలవాట్ల వల్ల వారి సంతానం కారణంగా ప్రతి 20 సంవత్సరాల తరువాత విషయాసక్తి, స్వార్థము, దురాచారాలు తరంగ రూపంతో అతి వేగంగా ప్రవహించి సమాజాన్ని అతలా కుతలం చేస్తున్నవి. ఈ సంస్కారాల దిశను భావితరాల నిర్మాతలు ఉన్నతోన్నత మైన మార్గములకు మరల్చినట్లయితే ప్రతి 20 సంవత్సరాల తరువాత సమాజం యొక్క పరిస్థితి ఉన్నతోన్నతమవుతూ పోతుంది.

మనుష్యుని పూర్తిగా మార్చేదానికి, పూర్తిగా క్రింద నుంచి పైదాకా మార్పు తేవడానికి వైదిక సంస్కృతి చేసిన ప్రయత్నం రెండో మూడో కాదు 16 సంస్కారాలు. సంస్కారాలు ఆత్మ పుట్టకముందే ప్రారంభమవుతాయి. పుట్టటానికి ముందు మొదటగా చేసే సంస్కారము గర్భాదానము. దానిని నేటి జడవాద ప్రపంచము విషయ తృప్తికి సాధనమనే అనుకుంటున్నది. ఈ సంస్కారాన్ని వైదిక సంస్కృతి నూతన ఆత్మను ఆహ్వానించే ఒక పవిత్ర యజ్ఞమంటున్నది.

# యజ్ఞము వివరణ

**ప్రశ్న :** స్వామీజీ మీరు భోదించిన 16 సంస్కారాలు యజ్ఞము మీద ఆధారపడి వున్నాయి. యజ్ఞము అంత శ్రేష్ఠమైనదా! మాకు పూర్తిగా యజ్ఞం గురించి వివరించగలరు.

**జవాబు :** యజ్ఞము చాలా గొప్పది. యజ్ఞం గురించి ఎంత వివరించినా తక్కువ అవుతుంది. గృహస్థులు సాధకులు నిత్య అగ్నిహోత్రం చెయ్యాలని ఉంది. ఎందుకని అంటే యజ్ఞం ప్రత్యక్షమైన దైవం. యజ్ఞం వలన చాలా ఫలితాలు ఉన్నాయి.

**ఉదా:-** భోపాల్‌లో 1984 డిసెంబర్ 3వ తేదీన ఒక సంఘటన జరిగింది. ఈ సంఘటన ప్రపంచం మొత్తం తెలుసు. ఒక మృత్యుభరితమైన రాత్రి సమయం, భోపాల్‌లోని యూనియన్ కార్బైడ్ కర్మాగారం నుండి విషభరితమైనట్టి వాయువు ప్రమాదవశాత్తూ వెలువడి వ్యాపించి, వందలకొద్దీ నిండు ప్రాణాలను బలికొని, కొన్ని వేలమందిని ఆసుపత్రుల పాలుచేసింది. అయితే ఇందులో శ్రీ సోహన్ లాల్ యస్.ఖుష్వహా మరియు శ్రీ ఎం.ఎల్.రాథోడ్ గారి కుటుంబాలను (ఈ ఫ్యాక్టరీకి ఒక మైలు పరిధిలో ఉన్నవి) మాత్రం ఈ మృత్యువాయువు ఏమీ చెయ్యలేకపోయింది. వీరు అనుదినం ఇంటిలో యజ్ఞం చేస్తుంటారు. వీరి ఇల్లు ఈ వాయు దుర్ఘటన వలన అతిగా బాధించబడిన ఏరియాలో వుండి కూడా ఆ ప్రాణాంతక వాయు దుష్ఫలితాలు ఎంతమాత్రం వీరిని అంటలేదు. వీరి కుటుంబాలలో ఎవరూ మృత్యువాత పడలేదు. ఎవరూ ఈ వాయు దుర్ఘటన మూలంగా ఆసుపత్రిపాలు కాలేదు. అంటే వాతావరణ కాలుష్యాన్ని నిరోధించడంలో అగ్నిహోత్రం సరైన మందు అని నిరూపణ అయింది. ఈ విషయం గురించిన వార్త 4.4.1985 నాటి "హిందూ" పేపరులో "Vedik Way to Beat Pollution" (వాతావరణ కాలుష్యాన్ని నివారించడానికి వేదమార్గం) అనే మకుటంతో ప్రచురించబడింది.

2. వేదాల్లో యజ్ఞాగ్ని ప్రశంస, ప్రార్థన చాలాచోట్ల కనిపిస్తుంది. ఈ ప్రశంస, ప్రార్థనల్లో యజ్ఞంలో ఇమిడివున్న శక్తుల గురించి, లాభాల గురించి వర్ణింపబడినది. వీటిని బట్టి మనకు తెలిసేది యజ్ఞాగ్ని ఎంత ఉపయోగకరమైనదీ, ఎంత గొప్పతనంతో నిండినదీ అటువంటి ప్రార్థనలు కొన్నిటిని చూద్దాం.

**శివోనామాసి స్వధితిస్తే పితానమస్తే ఉ అస్తు మామా హిగ్ంసీః**
**నివర్తయా మ్యాయుషే ఉన్నాద్యాయ ప్రజననాయ రాయస్పోషాయ**
**సుప్రజాస్త్వాయ సువీర్యాయ** – యజు –3/63

అర్థం : హే యజ్ఞ! నీవు నిశ్చయంగా కల్యాణకారివి. స్వయంభూ పరమేశ్వరుడు నీకు తండ్రి. నీకు నమస్కారం. నీవు మమ్ము రక్షించు, దీర్ఘాయువు. ఉత్తమమైన ఆహారము, శక్తి ఐశ్వర్యము, సమృద్ధి, శ్రేష్ఠమైన సంతతి, మంగళోన్ముఖములైన బల, పరాక్రమాల కొరకు మేము శ్రద్ధా, విశ్వాసపూర్వకంగా నీ సేవ చేస్తాము.

**త్వామగ్నే యజమానా అనుద్యూన విశ్వావసు**
**దధిరే వార్యాణి త్వయా సహ ద్రవిణ మిచ్ఛ మానా**
**ప్రజం గోమంత ముశిజో వివవ్రుః** – యజు –12/28

అర్థం : హే అగ్నిదేవ! సదాయజ్ఞం చేసే సద్గృహస్తు ఎల్లప్పుడూ శ్రేష్ఠమైన సంపదలకు అధిపతి అవుతాడు. అతడు ఈ యజ్ఞపురుషుని ప్రభావంతో జ్ఞానుల సత్సంగంతో పాటుగా ధనాన్ని పొందుతూ ఉంటాడు.

**పునస్త్వాదిత్యా రుద్రావసనః సమింధతాం పునర్బ్రహ్మాణో**
**వసునీధ యజ్ఞైః, ఘృతేనత్వం వర్ధయస్వ సత్యాః సంతు**
**యజమానస్య కామాః** – యజు –12/44

అర్థం : హే! ఐశ్వర్యమును ప్రాప్తింపజేయు యజ్ఞాగ్నే! నీవు ఈ యజ్ఞకర్త, ఆదిత్యయజ్ఞ, వసుయజ్ఞ, రుద్రయజ్ఞముల ద్వారా పదేపదే ప్రదీప్తం చేయి. ఈ యజ్ఞములతో నీవు నీ తేజస్సు యొక్క అభివృద్ధి చేసి యజ్ఞకర్తల యొక్క కామనలను నెరవేర్చుటకు సమర్థుడవు కమ్ము!

**అయమగ్నిః పురీష్యో రయిమాన్ పుష్టి వర్ధన**
**అగ్నే పురీష్యా భిద్యుమ్న మభి సహ్యా అయచ్ఛస్వ** - యజు -3/40

అర్థం : ఈ యజ్ఞాగ్ని వర్షాలను కురిపిస్తుంది. ధనాన్ని ఇస్తుంది. పుష్టిని, శక్తిని పెంపొందిస్తుంది. హే పురీష్యాగ్నే! నీవు మాకు అన్ని వైపులా బలాన్నీ, యశస్సును విస్తరింపజేయి.

**తిగ్ం శద్ధామ విరాజతి వాక్పతంగాయధీ యతే**
**ప్రతివస్తోరహ ద్యుభిః** - యజు -3/8

అర్థం : ఈ యజ్ఞాన్ని ప్రతిదినం చేస్తే అతడు తన ప్రదీప్త జ్వాలలతో గూడి నిరంతరం యజ్ఞకర్త అంతరంగంలో వెలుగొందుతూ ఉంటాడు. అటువంటప్పుడు ఎట్టి అంధకారం, అసురులు, అజ్ఞానం ఉండటానికి అవకాశమేది? నిజమైన యజ్ఞకర్త ఒకరోజు సంపూర్ణాంధకారం, అజ్ఞానాల నుండి విముక్తుడై దివ్యమైన పరమాత్మ చరణాలను చేరుకుంటాడు.

**శర్మాస్య వధూ తగ్ం రక్షేవధూతా రాతయో దిత్యా**
**స్త్వగసి ప్రతిత్వాది తిర్వేత్తు అద్రి రసి వానస్పత్యో**
**ప్రవాసి పృథుబుధ్నః ప్రతిత్వాదిత్యా స్త్వగ్వేతు** - యజు -1/14

అర్థం : హే యజ్ఞ! నీవు సుఖకారకుడవు. ఆశ్రయం తీసుకోటానికి యోగ్యుడవు. నీ వల్ల రోగాలు నశిస్తాయి. రోగాలు తెచ్చే సూక్ష్మజీవులను ధ్వంసం చేస్తావు. నీవు భూమికి కవచం వలె రక్షణనిస్తావు. నీవు పైరు పచ్చదనంతో నిండిన వనస్పతులచే అచ్ఛాదింపబడిన పర్వతంతో పోలిన సుందర, సౌభాగ్యవంతుడవు, హితకారివి కమ్ము! నీవు ఈ సువిస్తృతమైన ఆకాశంలో జలముతో నిండిన వర్షాభిముఖ మేఘము కమ్ము!

**ధాన్యమసి ధినాహిదేవాన్ ప్రాణాయ త్వోదానాయ**
**త్వావ్యానాయ త్వా, దీర్ఘామను ప్రసితి మాయుషే ధాం**
దేవో వః సవితా హిరణ్యపాణిః ప్రతిగృహ్ణాత్వ ఛిద్రేణ
**పాణినా చక్షషే త్వా మహీనాం పయో ఽసి** - యజు -1/20

అర్థం : హే యజ్ఞ! నీవు దేవతలకు ధాన్యమవతు (భోజనం) ఇప్పుడు ఈ హవిస్సుల ద్వారా వారిని ప్రసన్నుల జేయుము. వాటివల్ల వారు ప్రసన్నులై యజ్ఞకర్తకు సుఖమును, శుభమును కలుగజేయుదురు గాక! మేము మిమ్ము ప్రాణ, ఉదాన, వ్యానాది ప్రాణములందును, ఆయువు నందును, జీవనమును విస్తృతమైన ఉన్నతి చేసేటందుకు గాను ధారణ చేస్తున్నాము. తమ అనుగ్రహంతో ఈ సర్వవస్తువులను మాకు లభింప జేయుము.

**ఆదిత్యై వ్యుందన మసి విష్ణోస్తుపో స్యూర్ణా ప్రదసం**
**త్వా స్తృణామి స్వాసస్థాం దేవేభ్యో భువపతయే స్వాహా!**
**బువన పతయే స్వాహా! భూతానాం పతయే స్వాహా** – యజు –1/2/2

అర్థం : హే యజ్ఞ! నీవు పృథివిని సించనం చేస్తావు. అంటే భూమిపై నివశించే వారికి సర్వాంగీణ అభ్యున్నతి, కల్యాణాల అమృతంతో అభిషించనం చేస్తావు. హే దేవత లకు సుఖప్రదమైన స్థితిని కలిగించు, రక్షణ కలిగించు. యజ్ఞమా! నీవు సువిస్తృతం, సూక్ష్మాతి సూక్ష్మము కావడం కోరుకుంటున్నాం.

# గీతలో యజ్ఞ మహిమ

**సహయజ్ఞాః ప్రజాః సీష్ట్వా పురోవాచ ప్రజాపతిః**
**అనేన ప్రసవిష్వధ్వ మేషవోత్విష్ట కామధుక్** – గీత –3/10

అర్థం : కల్పము యొక్క ప్రారంభంలో ప్రజాపతి యజ్ఞంతోపాటు ప్రజలను సృష్టించాడు. యజ్ఞంతో మీరు అభివృద్ధి చెందండి. యజ్ఞం చేసి దేవతలను తృప్తిపరచి వారివల్ల మీరు కోరిన కోరికలను తీర్చుకోండి అని చెప్పారు.

**దేవాన్భావయ తానేన తే దేవా భావయంతు వః**
**పరస్పరం భావయంతః శ్రేయ పరమవాస్స్యథ** – గీత –3/11

అర్థం : ఈ యజ్ఞంతో దేవతలను ఉన్నతి చేయండి. ఆ దేవగణములు మీకు ఉన్నతిని కలిగిస్తారు. పరస్పరం ఉన్నతి చేస్తూ శ్రేయస్సును పొందవచ్చు.

**ఇష్టా న్భోగాన్హివో దేవా దాస్యంతే యజ్ఞ భావితాః**
**తైర్దత్తాన ప్రదాయై భ్యో యోభుంక్తే స్తేన ఏవసః** – గీత –3/12

అర్థం : యజ్ఞ భావితులైన దేవగణములు ప్రజలకు ఇష్టభోగ ప్రదానం చేస్తారు. వారి ద్వారా ఇవ్వబడిన భోగములను ఎవడైతే తాను ఇవ్వకుండా అనుభవిస్తాడో వాడు ఖచ్చితంగా దొంగయే.

**అన్నాద్భవంతి భూతాని పర్జన్యాదన్న సంభవః**
**యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మ సముద్భవః** – గీత –3/14

అర్థం : ప్రాణులన్నీ అన్నంతో పుడతాయి. అన్నము యొక్క ఉత్పత్తి పర్జన్యం (వృష్టి) వల్ల జరుగుతుంది. వృష్టి యజ్ఞం వల్ల జరుగుతుంది. యజ్ఞమైతే కర్మవల్లనే ఉత్పన్నమవుతుంది.

**యజ్ఞ శిష్టామృత భుజో యాంతి బ్రహ్మ సనాతనమ్**
**నాయం లోకో్య స్త్య యజ్ఞవ్య కుతో్యన్యః కురుసత్తమ** – గీత –4/31

అర్థం : హే కురుశ్రేష్ఠ! యజ్ఞముల పరిణామ రూపం అమృతము ననుభవంచు యోగి గణము సనాతన బ్రహ్మమును పొందుతారు. యజ్ఞము చేయని వారికి ఇహలోకంలో గూడా సుఖం ఉండదు. పరలోకం సంగతి చెప్పేదేముంది?

**అహం క్రతురహం యజ్ఞః స్వధాహమహమౌషధమ్**
**మంత్ర్యో హమే వాజ్య మహమగ్ని రహం హుతమ్** – గీత –6/16

అర్థం : భగవానుడంటున్నాడు, శ్రౌత కర్మ నేను. యజ్ఞం నేనే, స్వధా నేనే, ఔషధి నేనే, మంత్రం నేనే, ఆజ్యం (ఘృతం) నేనే, అగ్నిని నేనే, హవన రూపమైన క్రియను గూడా నేనే.

**యజ్ఞదానతపః కర్మ సత్యాజ్యం కార్యమేవతత్**
**యజ్ఞోదానం తపశ్చైవ సావనాని మనీషిణామ్** – గీత –18/5

అర్థం : యజ్ఞ, దాన, తపో రూపమైన కర్మను విడువరాదు. అంతేగాక ఆ కర్మ చేయదగినది. చేయడం కర్తవ్యం కూడా. యజ్ఞ, దాన, తపములు మూడు మనుషులను పవిత్రం చేసేవి.

# ఉపనిషత్తులలో యజ్ఞ రహస్య వర్ణన

కఠోపనిషత్తులో మొదటి అధ్యాయం, మొదటి వల్లిలో యమ, నచికేత సంవాదంలో యజ్ఞములు స్వర్గప్రాప్తికి మొదటి సాధనంగా చెప్పబడింది.

నచికేతుడు యమధర్మరాజు నడుగుతాడు –

**సత్వమగ్నిగ్ంం స్వర్గ మధ్యేషి మృత్యోప్రబ్రూహిత్వగ్ంం**
**శ్రద్ధా నాయమహ్యమ్ స్వర్గలోకా అమృతత్వం భజంత**
**ఏత ద్వితేయేన వృణోపరేణ** –3/13

అర్థం : హే మృత్యుదేవ! స్వర్గప్రాప్తికి సాధన రూపం అగ్నిని (యజ్ఞప్రక్రియను) చక్కగా నెరుగుదును. ఇప్పుడు తమరు ఆ అగ్ని విద్యను శ్రద్ధాళువునైన నాకు వివరించి చెప్పండి. దేనిని తెలిసి లోకులు స్వర్గలోకంలో నివశిస్తూ అమృతత్వాన్ని పొందుతాడు? ఇది నేను మిమ్ములను అడిగే నా రెండవ వరం.

**ప్రతే బ్రవీమి తతుమే నిబోధ స్వర్గ్య మగ్ని నచికేతః**
**ప్రజానన అనంత లోకాప్తి మధో ప్రతిష్టాం విద్ధిత్వ మేతు**
**నిహితం గుహాయామ్** –3/14

అర్థం : హే నచికేతా! స్వర్గదాయినియైన అగ్ని విద్య (యజ్ఞవిధిని) చక్కగా తెలిసిన నేను నీ కొరకు దానిని చక్కగా వివరిస్తాను. దాన్ని నానుండి చక్కగా తెలుసుకో. నీవు ఈ విద్యను అనంత లోకప్రాప్తిని కలిగించేదిగాను, దాని ఆధార స్వరూపం బుద్ధి రూపమైన గుహలో ఉన్నట్లుగా తెలుసుకో.

యజ్ఞవిద్యను, యజ్ఞప్రకరణం యొక్క సమస్త విధులను చెప్పిన తరువాత యమరాజు అగ్ని విద్య ఫలితాన్ని చెప్పారు.

**త్రిణాచి కేతా స్త్రిభి రేత్య సంధిం త్రికర్మ కృత్తరతి జన్మమృత్యు**
**బ్రహ్మజజ్ఞం దేవమీద్యం విదిత్వా నిచాయ్యే మాగ్ంం శాంతి**
**మన్యంత మేతి** –3/17

అర్థం : ఈ అగ్నిని శాస్త్రోక్తమైన రీతిలో మూడుసార్లు అనుష్టానం చేసిన వాడు ఋగ్, యజు, స్సామములనే మూడు వేదములతో పాటు సంబంధం జోడించి, యజ్ఞ, దాన, తపో రూపములైన మూడు కర్మలనూ చేస్తూ ఉండేవాడు. జననమరణ చక్రం నుండి తప్పించుకుంటాడు. బ్రహ్మ నుండి ఉత్పన్నమైన సృష్టిని తెలిసిన వాడు స్తవనీయమైన ఈ అగ్నిని చక్కగా తెలిసి దానిని సరియైన రీతిలో చయనం చేసి నాకు లభించిన అనంత శాంతిని పొందుతాడు.

ముండకోపనిషత్తు 2వ ఖండం 5వ శ్లోకం

**ఏతేషు యశ్చరతే, భ్రాజమానేషు యథాకాలం చాహుతయో హ్య**
**దదాయన్ తం నవన్త్వే తాః సూర్యశ్య రశ్మయో యత్ర దేవానాం**
**పతిరేకోధి వాసః**

అర్థం : ఏ అగ్నిహోత్రియైనా ఈ దేదీప్య మానమైన జ్వాలలో సరియైన సమయంలో అగ్నిహోత్రం చేస్తే, ఆ అగ్నిహోత్రిని నిశ్చయంగా తనతోపాటు తీసుకుని ఈ ఆహుతులు సూర్యకిరణములై అతడిని స్వర్గలోకానికి తీసుకుపోతాయి. అక్కడ దేవతల యొక్క అధిపతి నివాసం చేస్తాడు.

సరస్వతీ ఉపనిషత్తులో 14లో 'యజ్ఞం వష్టుధియా వసుః' అని ఉన్నది. దాని తాత్పర్యం యజ్ఞంతో ఐశ్వర్యం లభిస్తుంది అని. తరువాత 17లో 'యజ్ఞ దధే సరస్వతీ' అని ఉన్నది. దానివల్ల తెలిసేది, యజ్ఞంతోనే సరస్వతి ప్రసన్నమవుతుందని.

# రామాయణంలో యజ్ఞ చర్చ

రామాయణంలో యజ్ఞమహత్వం, విశదంగా వర్ణింపబడింది. పుత్రకామేష్టి చేయటం వల్లనే దశరథ మహారజుకు నలుగురు పుత్రులు జన్మించారు. రామచంద్రమూర్తి తన అవతారం యొక్క శ్రేయస్సును యజ్ఞభగవానునికే ఇస్తారు. యజ్ఞమే రామావతారానికి జనకుడు. పుత్రులు కావాలనే కోరికతో ప్రేరితుడై దశరథుల వారు పుత్రకామేష్టి యజ్ఞం చేశాడు. అతని కోరిక సత్ఫలితాల నిచ్చింది. తులసీ రామాయణంలో ఈ విధంగా వర్ణించారు.

'ఏక్‌బార్ భూపతి మన మాహీ, భోగలాని మోరే సుత నాహీ, గురుగృహ గయవు చరణలగి కరివినయ విశాలా, శృంగీ ఋషి హివశిష్ట బోలా వా, పుత్రకామ శుభయజ్ఞ కరావా, భగని సహిత ముని ఆహుతి దీన్హే, ప్రగటే అగిని చరుకర వీన్హే, యహ హవి భాంటి దేమం నృప జాయీా, జధా జోగ జేహి భగబనాయీా, త బహిరాయ ప్రతినారీ బులాఈ, కౌసల్యాది తహ చలి అయీా అర్ధభాగ కౌశల్యా హిందీన్హా, ఉభయ భాగ అథేకరలీన్హా, కైకేఈ కహోన్నృపసో దయ ఊ, రహస్యో ఉభయ భాగ పునిభయ కౌశల్యా కైకేయి హత ధరి, దీన్హి సుమిత్ర హిం మనప్రసన్న కరి, ఏహిబిధి గర్భ సహిత సబరానీ, భీ ఈ హృదయ హీ రషిత సుఖభారీ.

రాక్షస పతి రావణునకు గూడా యజ్ఞ శక్తి మీద పూర్ణ విశ్వాసం ఉన్నది. దాన్ని ప్రకటిస్తూ తన అనుచరులను ఎక్కడ యజ్ఞం జరుగుతున్నట్లు కనిపిస్తే అక్కడ విఘ్నం కలిగించి నాశనం చేయమని ఆదేశిమిస్తాడు.

సునహ సకల రజనీ చరజాథా, హమరే బైరీ విబుధ వరూధా, తినకర మరన ఏక విధి హో ఈ, కహహు బుఝా ఈ సునహ అబుసో ఈ, ద్విజ భోజన మఖ హోమ సరాధా, సబకై జా ఈ కరహు తుమా బాధా। ఛుదా ఛీన బలమీన సుర, సహజె హిమిబి హహి అయీా, తబమారిహ కె ఛాడి హఉ, భలీ భాంతి అపనాఈ।

విశ్వామిత్ర మహర్షి యజ్ఞం నాశనం చేయటంలో అసురులు భారీగా విఘ్నాలు సృష్టించారు. యజ్ఞసంరక్షణ కొరకు విశ్వామిత్రుడు దశరథుని వద్దకు పోయి రామలక్ష్మణులను పంపమని కోరాడు. వాల్మీకి రామాయణంలో ఈ ఘట్టము మధురంగా వర్ణింప బడింది.

**అహం నియమ మాతిష్ఠే విధ్యర్థం పురుషర్షభః**
**తస్య విఘ్నకరోద్వైతు రాక్షసౌ కామ రూపిణౌ** – 4

**నృతశ్రమో నిరుత్సాహస్త స్మా ద్దేశా దపాక్రమే**
**వచమే క్రోధ ముత్సృ ష్టం బుద్ధి ర్భవతి పార్థివ** – 7

**తథాభూత హిసా చర్యాన శాపస్తత్ర ముచ్యతే**
**స్వపుత్రం రాజశార్దూల రామం సత్యపరాక్రమం** – 8

**కాకపక్ష ధరం వీరం జ్యేష్టం మే దాతు మర్హసె** – 9

వాల్మీకి రామాయణం ఆదికాండ 16వ సర్గ

అర్థం : విశ్వామిత్రుడు దశరథునితో అంటాడు, "రాజా ప్రస్తుతం నేను ఒక మహాయజ్ఞాన్ని చేస్తున్నాను. కామరూపులైన ఇద్దరు రాక్షసులు దానిని పూర్తి చేయనీయటం లేదు. యజ్ఞం పూర్తి కాకపోతే కేవలం శ్రమ మాత్రమే మిగులుతుంది. అందువల్ల నిరుత్సాహంతోనే నిక్కడికి వస్తున్నాను.

హే పార్థివ! నేను వారిని శపించగలను. కాని ఈ యజ్ఞంలో కోపగించటం పనికిరాదు. కాబట్టి అటువంటి యజ్ఞసాధన కాలంలో ఎటువంటి శాపాన్ని ఇవ్వదలచు కోలేదు. హే రాజసింహమా! సత్యపరాక్రముడైన రామచంద్రుని, కాక పక్షధారణ చేసిన మహావీరుని, శ్రేష్ఠుని, నాకు అప్పగించు. అతడు నా దివ్య తేజస్సు ప్రభావంతో యజ్ఞ సంరక్షణ చేస్తాడు.

రావణుడు తన పరాజయం తప్పదని గ్రహించి, చింతితుడై, దుఃఖంతో, అంతిమ బ్రహ్మాస్త్రమైన యజ్ఞాన్ని శరణు వేడుతాడు. తన కుమారుడైన మేఘనాథుని ఒక గొప్ప తాంత్రిక యజ్ఞం చేసి అజేయుడై, రాముని సేనా సమేతంగా పరాజితుని చేసే శక్తిని పొందమని ఆదేశిస్తాడు. మేఘనాథుడు నికుంభల అనే పేరు గల ప్రదేశంలోనికి పోయి తన తండ్రి రావణుడు చెప్పిన విధానాన్ననుసరించి తాంత్రిక హోమాన్ని ప్రారంభిస్తాడు. వాల్మీకి రామాయణంలో దాని వర్ణన.

**ఏతస్తు హంత భోక్తారం హంత భుక్సదృశప్రభః**
**జుహువే రాక్షస శ్రేష్ఠో నిది వన్మంత్ర సత్తమైః** – 18

**సహవిర్లాజ సత్కారై ర్మాల్య గంధ పురస్కృతైః**
**జుహువే పావకం తత్ర రాక్షసేంద్రః ప్రతాపవాన్** – 19

**శస్త్రాణి శతపత్రాణి సమిధోథ విభీతకాః**
**లోహితా నిచవా సాంసి స్రుతం కార్ష్ణాయ సంతథా** – 20

అర్థం : ఆ స్థానం పేరు నికుంభల. అగ్నితుల్యుడైన తేజస్వి ఇంద్రజిత్తు ఇక్కడ విధి పూర్వకంగా అగ్నిలో హవనం చేయసాగాడు. ఆ ప్రతాపశాలి, రాక్షస శ్రేష్ఠుడైన ఇంద్రజిత్తు మొదట అగ్నిలో మాలను, సుగంధ ద్రవ్యాలను వేసి తరువాత పాయసం అక్షతలతో ఆ సంస్కారం పూర్తిచేసి హవనాన్ని ప్రారంభించారు. ఆ హవనకుండం నలువైపు శరములను, శస్త్రాలను ఉంచి తాంద్ర కలప ఇంధనంగా అందరూ రక్తవస్త్రాలను ధరించి ఇనుప స్రుక్కువాలతో మారణ తాంత్రిక హోమం చేస్తుండగా విభీషణుడు లక్ష్మణుని వెంటబెట్టుకుని ఆ యజ్ఞాన్ని ధ్వంసం చేయటానికి వెళ్ళగా అక్కడ సేనలు చుట్టూ అంతటా మోహరించి ఉన్నాయి. విభీషణుడు లక్ష్మణునితో అంటాడు.

**సత్వ మింద్రా శనిప్రఖ్యైః శరైరవ కిరం పరాన్**
**అభిద్ర వాశుయా ద్వైనై తత్కర్మ సమాప్యతే** – యుద్ధకాండ సర్గ 86

అర్థం : ఎప్పటివరకూ ఈ అభిచారిక హోమం పూర్తికాదో, అప్పటివరకు ఇంద్ర వజ్ర సదృశమైన బాణములతో రాక్షస సేనను బాధిస్తూ ఉండు అని, లక్ష్మణుడా విధంగా చేశాడు. తరువాత

**స్వమనీకం విషణ్ణాంతు శ్రుత్వా శత్రుభిరర్దితం**
**ఉదతిష్టత దుర్ధర్షః సకర్మణ యనతుష్టతే** ॥ 14 ॥

అర్థం : ఈ వంక అజేయుడైన రావణపుత్రుడు తన సేన శత్రుసేనతో వధింపబడి వ్యాకులం కావటం చూచి యజ్ఞం పూర్తి చేయకుండానే లేచాడు.

ఈ విధంగా యజ్ఞం ఫలవంతం కాకపోవటం వల్ల శ్రీరాముని సేనను నశింపజేసి ఇంద్రజిత్తు తాను అజేయుడు కాలేకపోయినాడు.

# శ్రీమద్భాగవతంలో యజ్ఞ మహత్వం

శ్రీమద్భాగవతంలో యజ్ఞమహత్వం విపులంగా ప్రతిపాదింపబడింది. యజ్ఞం యొక్క మహాశక్తిని వర్ణించే మరెన్నో ప్రసంగాలున్నాయి. యజ్ఞంతోనే సృష్టి ప్రారంభమైనది. దాని వర్ణన ఈ విధంగా ఉన్నది.

జిజ్ఞాస ననుసరించి ఉత్తర రూపంలో బ్రహ్మవిరాట్ భగవానుని స్వరూపాన్ని వర్ణిస్తాడు.

**యదాస్య నాభ్యాం నళినా దహ మాసం మహత్మనః**
**నావిదం యజ్ఞ సంఖారా స్పురుషావయ వాహతే**
**తేజయజ్ఞ స్యపశవః సవన స్పతయః కుశా**
**ఇదం చ దేవ యజనం కాలంచో సగుణాన్వితః ॥**
**వస్తూ న్యోషధయః స్నేహరసలోహమదో జ్వలం**
**ఋచో యజూంషి సామాని చతుర్హోత్రంచ సత్తమ ।**

– భాగవతం స్కందం 2, అ: 6 శ్లో 22, 23, 24

అర్థం : వ్యాపక బ్రహ్మము యొక్క (విష్ణు) నాభి నుండి నేను ఉద్భవించినపుడు పురుషుల అవయవాలు గాక మరే యజ్ఞసామాగ్రినీ చూడలేదు.

ఆయన యజ్ఞం పశువులు, వనస్పతులు, దేవతలు యజ్ఞం చేయటానికి తగిన భూమి అన్నిటిని సృజించాడు. పత్రాలన్నిటినీ సృజించాడు. ఓషధులు, నేయి, మధురాధికములు, స్వర్ణాదిధాతువులు, మృత్తిక, జలము, ఋగ్యజుస్సామ అధర్వ వేదములు, హవనం చేసే విధిని తెలియజేసే నాలుగు బ్రాహ్మణాలను అన్ని కర్మలను సృష్టి చేశాడు.

**గత యో మతయో శ్చైవ ప్రాయశ్చిత్తం సమర్పణం**
**పురుషావయ వైరేతే సంభారాః సంబృతామయా** – 26

**ఇతి సంభృత సంభారః పురుషావయవైరహం**
**తమేవ పురుషం యజ్ఞం తేనై వాయజమీశ్వరం** – 27

**తవశ్చ మనవఃకాలే ఈజిరే ఋషయోऽపరే**
**పితరో విధాదైత్యామనుష్యాం క్రతుభిర్విభుం ॥** – 29

అర్థం : విష్ణు క్రమాదిగతి, దేవతల ధ్యానాతి మతి ప్రాయశ్చిత్తం దానిని భగవదర్పణం చేయటం మొదలైన పురుషావయవములతోనే నేను సృష్టి చేశాను. పురుషావయవముల యొక్క సామగ్రి అంతటితోనూ పూజనీయ పరమాత్మ యజ్ఞమును

చేశాడు. దాని వెనుక తమ తమ సమయములో మనుష్యులు, ఋషులు, పితరులు, దైవగణములు, దైత్యాదులు గూడా యజ్ఞం ద్వారా యజ్ఞేశ్వరుని, యజ్ఞరూప భగవానుని పూజించారు. దక్షప్రజాపతి తన యజ్ఞం విధ్వంసం కావటం, తన సుపుత్రిక సతీదేవి దహనం జరిగిన తరువాత చాలా దుఃఖించి శివమహాదేవుని క్షమించమని కోరి, తన పాపానికి ప్రాయశ్చిత్తం రూపంలో విశుద్ధ యజ్ఞాన్ని నెరవేర్చాడు. భాగవత చతుర్థ స్కంధంలో దాని వర్ణన ఏడవ అధ్యాయంలో ఉన్నది.

**క్షమాత్త్వైవం సమీద్వాంసం బ్రహ్మణాచానుమంత్రితః**
**కర్మసంతానయామాన సోపాధ్యాయద్విషగ్నభిః** – 26

**వైష్ణవం యజ్ఞ సంతత్యై త్రికపాల ద్విజోత్తమాః**
**పురోడాశం నిఖవవన్ వీర సంసర్గ శుద్ధయే ॥** – 27

**అధ్వర్య గుణాత్త హవిషాయజమానో విశాంపతే**
**ధియా విశుద్ధయాదద్యౌ తథాప్రాదుర్భూద్ధరిః** – 28

అర్థం : ఈ విధంగా దక్షుడు తన అపరాధానికి క్షమనువేడి, బ్రహ్మదేవుల అనుమతి తీసుకుని ఉపాధ్యాయ, ఋత్విజ, అగ్ని సహిత యజ్ఞ కర్మాదులను బహు సుందరంగా విస్తరించాడు. మూడు కపాలముల పురోదాశము విష్ణువు నిమిత్తం యజ్ఞం పూర్తిచేయడానికి ప్రమథాది వీరుల శుద్ధి కొరకు శ్రేష్టులైన బ్రాహ్మణులకు సమర్పించారు. అధ్వర్యుడపుడు చేతిలో హవిని తీసికొని యజమాన సహితంగా విశుద్ధ బుద్ధి పూర్వకంగా హవనం చేసి వాసుదేవ భగవానుని ధ్యానించాడు. అప్పుడు భగవానుడు సాక్షాత్కరించాడు.

ఋషభదేవులు భగవంతుని అవతారంగా భావిస్తాం. ఆయన పుత్రుడైన భరతుని పేరుతోనే ఈ దేశం భారతవర్షంగా పిలుస్తున్నాం. భరతుడు యజ్ఞంతోనే ఈ దేశాన్ని తపోభూమిని చేశాడు.

**ద్రవ్యదేశకాల వయశ్శుద్ధతదద్వి విదోదేశోర్చాచ తైః**
**సవైరపి క్రతోభిర్యథేపదేశం శశత కృత్వ ఇయాజ ॥** ॥ 16 ॥

**భగవతర్షభేణ పరిరక్ష్యమాణ ఏతస్మిన్వర్షేన**
**కశ్చన పురుషోవాంఛన్న్య విద్యమానభివాత్మనో౽**
**న్యస్మాత్కధంచన కిమపి కర్హిచిదవేక్షతే**
**భర్తర్యను సవనం విజృంభిత స్నేహాతిశయమంతరేణ** ॥ 17 ॥

– భాగవతం 5వ స్కంధం – అ. 4

అర్థం : భరతుడు అన్నివిధముల పూర్ణనిధి విధానంతో నూరు, నూరుమార్లు యజ్ఞాలు చేశారు. అతడి ఆ యజ్ఞాలు సాధారణంగా జరగలేదు. ద్రవ్య, దేశ, కాల, యౌవన, శ్రద్ధా, ఋత్విక్కులు, అనేక దేవతల కొరకు, ఇత్యాదుల ద్వారా అతిశయంగా, విస్తారంగా సంపన్నమైనాయి. ఆ సమయంలో ఎవరికీ మరొకరితో తన కొరకు గగన కుసుమంవలె ఎటువంటి ప్రార్థన చేయవలసిన కోరిక కలుగలేదు. ఎవరూ మరొకరి వస్తువు కొరకు లోభపడలేదు. అందరిలోనూ స్నేహం, సంపద, ఉత్సాహం ఉరకలు వేసింది.

**యజ్ఞం ద్వారా దేవశక్తుల తుష్టి, పుష్టి**

సృష్టి సంచాలనం చేసే ఈశ్వరుని శక్తుల పేరు దేవతలు. అనేక శక్తులు, అనేక దేవతల పేరుతో పిలువబడతాయి. వీరికి ప్రపంచమంతటి విభిన్న సమస్యలు, మనుష్యుల వ్యక్తిగత జీవనంలో సుఖసంపదలు, ఉన్నతి – పతనం, హాని – లాభాలు, రోగశోకాదులతో అతిఘనిష్ట సంబంధం ఉన్నది. ఈ దేవశక్తుల అనుకూలతను పొంది మనుష్యులు చాలా సులభంగా తమ ఉన్నతికి తలుపులు, తెరుచుకోగలుగుతాయి. ఆ దేవతలతో విరోధం కలిగితే మనిషి ఎంత కష్టపడ్డా ప్రయోజనం శూన్యం. దేవశక్తులను ప్రసన్నం చేసుకోటానికి ఎన్నో సాధనలు మొదలైనవి యాజ్ఞిక క్షేత్రంలో వివరింపబడ్డాయి. వీటిలో యజ్ఞం సర్వశ్రేష్ఠమైనది. యజ్ఞంతో దేవతలు ప్రసన్నులవుతారు. కోరిన కోరికలను నెరవేరుస్తారు. అందుకు అనేక ప్రమాణాలు మనకు కనిపిస్తాయి. అందులో కొన్ని –

**ప్రీయతాం పుండరీకాక్షః సర్వయజ్ఞేశ్వరోహరిః**
**తస్మింస్తుష్టే జగత్తుష్టం ప్రీణతేప్రీణితాం భవేత్ –**

– మత్స్యపురాణం – అ. 239 – శ్లో॥ 38

అర్థం :కమలనయనుడైన హరి యజ్ఞంతో ప్రసన్నుడవుతాడు. ఆయన సంతోషిస్తే జగత్తంతా సంతోషిస్తుంది. ఆయన ప్రసన్నుడైతే జగత్తంతా ప్రసన్నమవుతుంది.

**యజ్ఞేనదేవాజీవన్తి యజ్ఞేన పితరస్తథా**
**దేవదాధీనం ప్రజాసర్వా యజ్ఞాధీనశ్చదేవతా** 1

**యజ్ఞోహి భగవాన్విష్ణుర్యత్ర సర్వం ప్రతిష్టితం**
**యజ్ఞార్థం పశవ స్రష్టాదేవాస్త్వోషధయస్తథా** 2

**యజ్ఞార్థం పురుషాః స్రష్టాః స్వయమేవస్యభువా**
**యజ్ఞైశ్చభూత్యై సర్వస్యతస్మాత్యజ్ఞ పరోభవేత్** 3

**యజ్ఞాశిష్టాశివః సంతోముచ్యతే సర్వకిల్బి షైః**
**ధనం యద్యజ్ఞ శీలాఅందేవస్వం తం విదుర్బుధాః** 4

**యజ్ఞేన సమ్యక్పురుషస్తు నాకే సంపూజ్యమాన**
**స్త్రిదశైర్మహాత్మా, ప్రాప్నోతి సౌఖ్యాని మహానుభావా**
**స్తస్మాత్ప్రయత్నేన యజేత యజ్ఞైః** 7

అర్థం : యజ్ఞంతో దేవతలు, పితరులు జీవిస్తారు. ప్రజలందరూ దేవతల ఆధీనంలో ఉంటారు. దేవతలందరూ యజ్ఞానికి అధీనులు. యజ్ఞమే విష్ణు భగవానుడు. ఆయనలోనే సర్వం ప్రతిష్టితమై ఉన్నది. యజ్ఞం కోసమే దేవతలు, ఓషధులు సృష్టింపబడ్డాయి.

స్వయంభువదేవులు యజ్ఞము కొరకే మనుష్యులను సృష్టించారు. అప్పుడాయన అన్నారు. యజ్ఞం అందరకూ కల్యాణకరం. అందువల్ల యజ్ఞతత్పరులు కండి! యజ్ఞావశిష్టాన్ని భుజించేవాడు. సర్వపాపములనుండి ముక్తి పొందుతాడు. యజ్ఞశీలుర ధనం, మీద పండితులకు దేవస్వం, ఇవ్వబడింది (మిరాశి).

యజ్ఞంద్వారా మహాత్ముడైన పురుషుడు స్వర్గానికి పోయి, దేవతల పూజలందుకుంటాడు. ఓ మహానుభావులైన ఋషులారా! యజ్ఞకర్తయైన మహానుభావుడు స్వర్గం చేరి అనేక సౌఖ్యాలను పొందుతాడు. అందువల్ల ప్రయత్న పూర్వకంగా యజ్ఞం ద్వారా భగవానుని యజనం చేయండి.

**దైవే కర్మణి యుక్తోహి విభర్తీం చరాచరం - 75**
**అగ్నౌ ప్రాస్తాహంతిః సమ్యగాదిత్య ముపతిష్టతే**
**ఆదిత్యాజ్జాయతే వృష్టిర్వృష్టేరన్నం తతః ప్రజా ।** **మనుస్మృతి - 3-76**

అంటే ఏ దేవత హోమకర్మయుక్తుడో అతడు చరాచరముల పోషణకర్త. కారణం అగ్నిలో వేసిన ఆహుతులు ఆదిత్యుని చేరుతాయి. సూర్యుడు వర్షాలు కురిపిస్తాడు. వర్షాలవల్ల పంటలు పండి అన్నం లభిస్తుంది. అన్నంతో ప్రజాపోషణ జరుగుతుంది. అందువల్ల యజ్ఞకర్త సమస్త ప్రజలను పోషిస్తాడు.

**యజ్ఞైరాప్యాయాపితాదేవా వృష్ట్యుత్సర్గేణవై ప్రజాః**
**ఆప్యాయయంతే ధర్మజ్ఞ యజ్ఞాః కల్యాణ హేతవః ॥** **8**

**శ్రీవిష్ణుపురాణం, ప్ర. అంశ. అధ్యా - 6**

అర్థం : హేధర్మరాజ! యజ్ఞంతో తృప్తి చెంది దేవగణములు వర్షం కురిపించి ప్రజలను తృప్తిపరుస్తారు. యజ్ఞం సర్వదా కల్యాణ హేతువు.

**యోయజ్ఞైరిజ్యతేదేవో వాసుదేవః సనాతనః**
**స సర్వే దైవత తనుః పూజ్యతే పరమేశ్వర ॥**

**కూర్మపురాణం - పూర్వార్థం అ.20 శ్లో॥ 40**

అర్థం : ఎవరైతే యజ్ఞాలలో సనాతనుడైన వాసుదేవుని భజన చేస్తారో, వారు సదా దేవతల శరీర రూపుడైన పరమేశ్వరుని పూజనంచేసినట్లే. అంటే సనాతనుడైన వాసుదేవుని యజ్ఞాలలో యజనం చేయటంతో సర్వదేవతలకు యజనం చేసినట్టే.

**తస్మాదీశ ప్రసాదార్థం యూయంగత్వాభువంద్విజాః**
**దీర్ఘసత్రం సమాకృధ్వం యూయం వర్ష సహస్రకం**

**శివపురాణం. వి.స.1, అ.4**

అర్థం : యజ్ఞమే శివుని ప్రసన్నం చేసుకునే శ్రేష్ఠమైన సాధనం. అందువల్ల ఋషి గణములారా! మీరందరూ భూమి మీదికి పోయి వేయి సంవత్సరాలపాటు దీర్ఘకాలీన విశాల యజ్ఞం చేయండి.

**యే విష్ణుభక్తా నిష్కామాయజంతి పరమేశ్వరం**
**త్రి సప్తాకులా సంయుక్తాస్తే యాంతిహరి మందిరం ॥ ॥**
**బృహన్నారద పురాణ : అ.39, శ్లో॥ 61**

ఎవరైతే నిష్కాను భావంతో యజ్ఞంచేసి పరమాత్మను పూజిస్తారో వారు తమ ఇరువదియొక్క తరాలతోసహా వారి మందిరానికి చేరుకుంటారు.

**హవనం ద్వారా రోగకారక క్రిములు నశింపజేయుట :**

డా. పుందన్‌లాలు, యం.డి. 'యజ్ఞ చికిత్స' అనే పేరు గల ఒక గ్రంథం 1949లో జబల్‌పూర్‌లో ప్రకాశింపజేశాడు. ఆయన అల్లోపతి డాక్టరు. కానీ దాన్ని వదిలిపెట్టి క్షయరోగాన్ని యజ్ఞం ద్వారా చికిత్స చేయడంలో లీనమయ్యాడు. ఆయన జబల్‌పూర్‌లో ఒక టి.బి. శానిటోరియం కూడా తెరిచాడు. యజ్ఞం నుండి వెలువడే వాయువులను గురించి ఆయన కొన్ని ప్రయోగాలు చేశాడు. 'యజ్ఞ చికిత్స' అనే పుస్తకం 193వ పేజీలో ఆయన వ్రాస్తాడు – 12 గాజు సీసాలు తీసుకొన్నాడు. శాస్త్రీయంగా వాటిని పూర్తిగా శుద్ధం చేశాడు. వాటిలో ఉండే క్రిములు మొదలైన వాటిని పూర్తిగా తొలగించాడు. ఆ తరువాత 6 సీసాలలో పాలు, మాంసము మొదలైన 6 వస్తువులు నింపాడు. ఇప్పుడు ఆ 6 సీసాలు ఒకవైపు, మిగిలిన 6 సీసాలు రెండవ వైపు ఉంచాడు. వాటిలో ఒకవైపు ఉన్న సీసాలలో యజ్ఞం వాయువును చేర్చాడు. రెండవ వైపు సీసాలలో ఉద్యానవన శుద్ధ వాయువు నింపాడు. సీసాలు మూసి ఉంచాడు. రోజూ వాటిని పరీక్షించ సాగాడు. తేలిన విషయమేమిటంటే ఉద్యాన వాయువు నింపిన వాటిలో కుళ్లటం వెంటనే ప్రారంభమై, త్వరగా పెరగసాగింది. దీనికి వ్యతిరేకంగా యజ్ఞం వాయువు నింపిన సీసాలో మురగడం ఆలస్యంగా ఆరంభమయింది. నెమ్మదిగా పెరగసాగింది. దీనికర్థము ఏమిటి? యజ్ఞం వాయువు ఉద్యాన శుద్ధ వాయువుకంటే కూడా మురుగును ఎక్కువగా నిరోధిస్తుంది. ఈ ప్రయోగం యజ్ఞం మామూలు సామగ్రితో చేయబడింది. క్షయనాశక విశేష సామగ్రి తయారుచేసినపుడు దాని ప్రభావం కుళ్లిన శ్వాసకోశములపై క్షయరోగ కీటాణువు వలన కుళ్లి వాటిపై ఎక్కువగా ఉంటుంది. దీనితోపాటుగా ఈ ప్రయోగం ఇంకొక విషయాన్ని కూడా స్పష్టం చేస్తుంది. నిత్యాగ్నిహోత్రం చేసేవారి శరీరాలలో

ఇలాంటి రోగాలు పుట్టనే పుట్టవు. వారిలో ఎవరికైనా చీము పడితే నిత్యం అగ్నిహోత్రం వాయువు చేరుటవలన చీము వెంటనే మాడిపోతుంది, గాయం మానుతుంది.

ఇదిగాక ఇంకొక ప్రయోగం కూడా చేశారు. యజ్ఞం వాయువును నీళ్లలో కలిపి శరీరంపై ఉన్న కుళ్ళిన భాగాలు కడిగివేశాడు. దీని పరిణామంగా ఏదో ఒక గాయం నుండి చీము అధికంగా వచ్చింది. తరువాత గాయం త్వరగా నయమై మాడి పోయింది. మొదట చీము ఎక్కువగా రావడానికి కారణం లోపల చాలా లోతువరకు వున్న చీము బయటకు వచ్చింది. ఇక గాయం మానిపోయింది.

ఈ విధంగా యజ్ఞం గురించి వివరించుకుంటూ పోతే ఉదాహరణలు చాలా ఉన్నాయి. విశ్వామిత్రుడు యజ్ఞం చేసేటప్పుడు రామలక్ష్మణులను యజ్ఞరక్షకులుగా తీసుకువెళతాడు. దశరథ మహారాజు పుత్రకామేష్ఠి యాగం చేసాడు. ఆ యాగ ఫలితమే రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు ఇలా వివరించాలంటే చాలా ఉదాహరణలున్నాయి.

# సంస్కారాలు

**16 సంస్కారాలు :**

ఈ 16 సంస్కారాలు ప్రతి భారతీయుడు పాటించవలసిందే. ఈ సంస్కారం వలనే మానవుడి జీవితం ఆధారపడి ఉంటుంది. సన్మార్గంలో నడవాలంటే, మంచి సంతానం ఉండాలంటే మనశ్శాంతిగా బతకాలంటే ధర్మమార్గంలో నడవాలనుకుంటే ఈ కర్మలను అనుసరించి ఆచరణలో పెడితేనే మన మానవ జీవనం ప్రశాంతమైన ప్రయాణం సాగుతుంది. చివరి దశలో పరమాత్మున్ని చేరుతుంది. ఏ ఆచరణ పాటించని వారి జీవితాలు, చంచలం కొద్ది మనశ్శాంతి లేకుండా, జీవన ప్రయాణం ఏ వైపు కొనసాగుతుందో అర్థంకాక సతమతమవుతున్న జీవితాలను ఎన్నో చూశాము. కనుక ప్రేమ స్వరూపులారా మన వేదంలో చెప్పబడిన ఈ 16 సంస్కారాలను ఆచరిస్తూ అనుసరిస్తూ కొనసాగించాలని కోరుతూ...

## వైదిక సంస్కృతి

లక్షల సంవత్సరాల క్రితమే మన ఋషులు వేద శాస్త్రాలను అధ్యయనం చేసి మానవ జన్మ చాలా విలువైనదని ఆ విలువైన జన్మకు ఇంకా విలువను పెంచి జ్ఞాన మార్గమున నడిపించుటకు 16 పర్యాయాలు సంస్కరించవలసి ఉంటుందని తెలుసుకున్నారు. వేదాల ఆధారంగా ఆ విధి విధానాలను రూపొందించి వాటికి షోడశ సంస్కారాల ప్రథశుద్ధంగా, వైదికంగా, వైజ్ఞానికంగా, హేతుబద్ధంగా ఉండేది. అనంతరం ఆ వైదికాచారాలు చోటు చేసుకున్నాయి.

ఈ సంస్కారాలు మూఢనమ్మకం కొద్ది చేసేటివి కావు. నేను వ్రాసే ప్రతి అక్షరం నేను చెప్పే ప్రతి క్రియ ఏ సైన్స్ పరికరాలతోనైనా పరిశీలించుకోవచ్చు. ఈ 16 సంస్కారాలను సైన్స్‌పరంగా విడదీసి అందిస్తున్నాను.

**1. గర్భధారణము సంస్కారం :** సంతానం కోరుతూ భార్యాభర్తలు కలిసే క్రియను గర్భదానం అంటారు. ఆ రతిక్రియ జరపబోయే ముందు అందుకు తగిన విధంగా ఆ భార్యాభర్తల శరీరాలను, మనస్సులను తీర్చిదిద్దుటకు విశేష హోమం చేస్తారు. ఉత్తమ భావాలతో వారి హృదయాలను నింపుతారు. అందువల్ల మంచి సంస్కారవంతమైన జీవాత్మ భార్య గర్భంలో ప్రవేశించి శరీరధారణ చేస్తుంది.

**గర్భాధారణ మీద సుగుణ మాట :** విత్తనాలు వేసేటప్పుడే మంచి విత్తనాలు వేయాలి. అని పెద్దలు మనకు చాలాసార్లు చెప్పారు. ఒకప్పుడు మన పూర్వీకులు గర్భాదానం ఈ విధంగా ఉంటే మంచి సంతానం కలుగుతుందని మనకొక మంచి మార్గాన్ని అందించారు. భార్యభర్తలు ఇద్దరు స్నానం చేసి ఉదయం సూర్యాష్టకం చదివి గాయత్రి ఉపాసన చేసేవారు. పండ్లు, పాలు, ఆహారంగా తీసుకుంటూ యజ్ఞం వద్ద భార్యాభర్తలు కూర్చొని ఒక మంచి జ్ఞానమైన సంతానం కలగాలని సంకల్పం చేసి గర్భధారణకి ఒక ప్రత్యేకమైన హోమం ఉంటుంది. ఆ హోమం చేసి సాత్వికాహారం తిని ఒక శుభ ముహూర్తంలో రతిక్రియ చేసేవారు. వాళ్ళకు కలిగే సంతానం మంచి జ్ఞానమైన సంతానం కలిగేది.

**ఉదా :-** యోగానంద పరమహంస రచించిన ఒక యోగి ఆత్మకథ పుస్తకంలో చదివాము. యోగానంద పరమహంస వాళ్ళ అమ్మని, వాళ్ళ అక్క ఈ విధంగా అడిగింది. అమ్మా నీవు ఏంటి ఎప్పటికీ మావద్దే ఉంటావా. నాన్న ఒంటరిగా ఉంటారు కదా నీవు నాన్న వద్దకు వెళ్ళవా అని అడుగుతుంది. అప్పుడు యోగానంద పరమహంస తల్లి ఈ విధంగా బోధించింది. మా గురువుగారు అయిన లహరి మహాశయులు మాకు క్రియాయోగం నేర్పించి జ్ఞాన మార్గంలో నడిపించారు. గురువుగారు మాకు సంతానం కావాలని లహరి మహాశయులను అడిగినప్పుడు మాకు గర్భాదానం గురించి వివరించాడు. సంతానం కోసం మాత్రమే మేము సంసారం చేశాము అని వాళ్ళ అమ్మ చెప్పడం జరిగింది.

లహరి మహాశయులు బ్రహ్మజ్ఞానులు వాళ్ళ శిష్యులకు గర్భాదానం గురించి చెప్పాడు కాబట్టి వారి శిష్యులు అది పాటించారు. వాల్ళు పాటించడం వల్లె వారి గర్భాన జన్మించిన వారందరు జ్ఞానులయ్యారు. యో-ప-కూడా జన్మించారు. కాబట్టి మీరు కూడా 16 సంస్కారాలను పాటించండి. ఈ సమయంలో మన భారతదేశానికి మంచి సంతానం అవసరం.

సుగుణ ఖండించిన నియమం

**ఉదా :-** ఇప్పుడు ఉన్న మన యువత వాయి వరుసలు మరచిపోయి, కుక్కల కన్నా హీనంగా కళ్ళు మూసుకుపోయి ప్రవర్తిస్తున్నారు. ఈ రోజు మన భారతదేశంలో ఏ ఇంట్లో కూడా మనశ్శాంతి లేదు. తండ్రి మాట కొడుకు వినడు. కొడుకు మాట తండ్రి వినడు. తల్లిదండ్రులు అంటే గౌరవం లేదు. అందుకే వృద్ధాశ్రమంలో పడేసి తల్లిదండ్రులు

చనిపోయారంటే కనీసం చూడటానికి కూడా వెళ్ళటంలేదు. అంత కఠినమైన కొడుకుల్ని కన్నారు మనవాళ్ళు. వాళ్ళు అలా తయారు కావడానికి కారణాలు చెప్పాలంటే

మీరు గర్భాధారణ చేసేటప్పుడు మందు తాగి మాంసం తిని, సంసారం చేస్తే అలాంటి సంతానం కాకుండా ఎలాంటి సంతానం పుడుతుంది. నాయనా! మందు త్రాగిన తర్వాత మనిషి రాక్షసుడవుతాడు. మందు తాగిన వ్యక్తికి ఒక కత్తి ఇచ్చి వేరే వ్యక్తిని చంపేయమంటే చంపేస్తాడు. మంది తాగిన వ్యక్తి మనస్సు చంచలంగా ఉంటుంది. మందు తాగిన తర్వాత అతని గుండె 72 సార్లు కంటె ఎక్కువగా కొట్టుకుంటూ అహంకారిగా ఉంటాడు. కోపిష్ఠిగా ఉంటాడు. అతని రక్తం కూడా అశుద్ధమై ఉంటుంది. అలాంటి సమయంలో సంసారం చేసేటప్పుడు ఎలాంటి సంకల్పం చేస్తాడు. బ్రహ్మజ్ఞాని పుట్టాలని చేస్తాడా, లేదా యోగులు జన్మించాలని చేస్తాడా త్రాగిన మత్తులో ఏమని సంకల్పం చేస్తాడు. అప్పుడు చేసేది గర్భధారణ కాదు. కేవలం కామంతో కళ్ళు మూసుకుపోయి కామ కోరిక తీర్చుకుంటాడు. ఆ కామ కోరికను ఏ విధంగా తీర్చుకుంటున్నాడు. అహంకారంతో, క్రోధంతో ఒక రాక్షసుడిలాగా సమయం సందర్భం లేకుండా కామాన్ని అనుభవిస్తున్నాడు. అలాంటి సమయంలో గర్భధానం జరిగితే ఎలాంటి పిల్లలు పుడతారు. వాళ్ళ మనస్సు, ప్రవర్తన కూడా రాక్షసుడిలా ఉంటుంది. ఈ రోజు మన యువత 75 శాతం అలాగే ఉన్నారు. కావాలంటే మీకు సైంటిఫిక్‌గా ప్రూవ్ చేస్తా. మనము మహాభారతం కథలో చదివాం కదా. సూర్యుడు అస్తమించే సమయంలో సంసారం చేస్తే రాక్షసులు జన్మిస్తారు అని మన పెద్దలు చెప్పారు. మరి మందు తాగి, మాంసం తిని సమయం కాని సమయంలో సంసారం చేస్తే మరి మనకు ఎలాంటి పిల్లలు జన్మిస్తారు. మీరే ఆలోచించండి.

మనశ్శాంతి కావాలంటే మంచి సంతానం ఉండాలి. కాబట్టి ఆలోచించుకోండి.

ప్రశ్న : స్వామిజీ మందు, మాంసం మీరు తినకూడదు, త్రాగకూడదు అంటున్నారు. సైన్స్ పరంగా మాంసం తినవచ్చు, మందు త్రాగవచ్చు అంటున్నారు. మీరు యోగశాస్త్రము, సైన్స్ ఒకే విధంగా ఉన్నాయి అని చెప్పారు. ఒక్కొక్క మహర్షి, ఒక్కొక్క సైంటిస్టులతో సమానం. అని చెప్పారు. మీరు ఏ విధంగా పరిశోధన చేసి మందు, మాంసం తినకూడదు, త్రాగకూడదు అని అంటున్నారు పూర్తిగా వివరించగలరు.

**స్వామీజీ జవాబు :** యోగశాస్త్రం బోధించేది సైన్స్ ప్రకారమే. ఏ గురువైనా చాలా దూరం ఆలోచించి భవిష్యత్తును దృష్టిలో పెట్టుకొని జ్ఞానాన్ని బోధిస్తారు. ఎలాంటి ఆహారం తింటే ఎలాంటి మనస్సు ఉత్పత్తి అవుతుందో, ఏ ఆహారం తిని సంసారం చేస్తే ఎలాంటి పిల్లలు పుడతారు అని గురువులు రాబోయే కొన్ని తరాలను దృష్టిలో పెట్టుకొని ఈ రోజు జ్ఞానబోధ చేస్తారు. డాక్టర్లు చెప్పేది మన శరీరం బాగుండాలి. మీరు ఈ ఆహారం తినండి మీ శరీరం దృఢంగా తయారు అవుతుంది అని మన శరీరం బాగుండాలి అని ఆహార నియమాలు చెబుతున్నారు.

**ఉదా :-** ఒక టి.బి. పేషెంటుకి మటన్ తినమని డాక్టర్లు సలహా ఇస్తున్నారు. డాక్టర్లను నేను తప్పుపట్టడం లేదు. వారు మన శరీరం బాగుండాలి అని కోరుకుంటున్నారు. యోగశాస్త్రం ప్రకారం చెబుతాను వినండి. ఒక నిప్పుల గుండంలో ఎండుమిర్చి, ఉప్పు వేస్తే ఎలాంటి ప్రభావం చూపుతుంది. ఆ మిరపకాయల ఘాటు కొంత దూరమే ఆ ప్రభావం చూపుతుంది. అదే నిప్పుల గుండంలో ఆవునెయ్యి వేస్తే ప్రాణవాయువు ఉత్పత్తి అవుతుంది. సుగంధ ద్రవ్యం వేస్తే సుగంధం ఉత్పత్తి అవుతుంది. అదే విధంగా మన కడుపుని వేదాలలో యజ్ఞగుండంగా వివరించారు. మన కడుపులోకి ఎలాంటి ఆహారం తింటే అలాంటి మనస్సు ఉత్పత్తి అవుతుంది అని సైన్‌పరంగా రుజువు చేసారు. వుదాహరణకి చెబుతాను వినండి, ఒక వ్యక్తికి మందు త్రాగించి మాంసం తినిపించి చేతికి ఒక కత్తిని ఇస్తే వేరే అతనిని చంపామంటే వెనుక ముందు ఆలోచించకుండా చంపేస్తాడు. అదే వ్యక్తికి పాలు త్రాగించి ఓ రెండు అరటిపండ్లు తినిపించి చేతికి కత్తిని ఇచ్చి వేరే అతనిని చంపామంటే చంపగలుగుతారా? చంపలేరు. పొరపాటున కాలు తగిలితే క్షమించమని అడిగేవారు ఎలాచంపగలుగుతారు. ఎందుకు అంటే పాలు త్రాగి, పండ్లు తింటే సాత్విక గుణం ఉత్పత్తి అవుతుంది. అదే మాంసం తిని, మందు త్రాగితే రజోగుణం ఉత్పత్తి అవుతుంది. రజోగుణానికి ఉండే లక్షణాలు. కోపం, ఆవేశము, కామం, క్రోధం, స్వార్ధము, మూర్ఖత్వము ఒక రాక్షసుడు అన్నీ వివరించవచ్చు. అదే సాత్విక గుణానికి ఉండే లక్షణాలు భక్తి, ప్రేమ, ఆత్మీయత, బాధ్యత ఉంటుంది.

మందు త్రాగి, మాంసం తిని రజోగుణంతో చంచలమైన మనస్సుతో మీరు కాపురం చేసినట్లయితే మీకు పుట్టబోయే పిల్లలు చంచలమైన మనస్సుతో రజోగుణంతో

పుడతారు. ఎలా అని నన్ను ప్రశ్నించవచ్చు. మీరు మాంసం తిని మందు తీసుకున్నప్పుడు మీ రక్తమును టెస్ట్ చేయ్యండి. ఆల్కహాల్ పర్సెంటేజ్(%) ఎంత ఉందో చూడండి. ఆ ఆల్కహాల్ కలిసిన బ్లడ్‌తోనే వీర్యము తయారు అవుతుంది. అంటే వీర్యం కూడా కలుషితమైనది. రక్తము కూడా కలుషితమైనది. ఇలాంటి సమయంలో సంసారం చేస్తే ఎలాంటి పిల్లలు పుడతారు. పుట్టిన పిల్లలు తల్లిదండ్రుల మాట వినరు, ఇంట్లో మనశ్శాంతి ఉండదు. వారు మనశ్శాంతిగా ఉండరు వేరేవాళ్ళని మనశ్శాంతిగా ఉంచరు. మీరు ఇది నిజమా! కాదా! అని తెలుసుకోవాలని అనుకుంటే ఏ సైన్స్ పరికరాలతో ఐనా పరిశీలించండి. బైబిల్‌లో ఏమి రాశారు ఎక్కువ మాంసం తినడం వల్ల రాక్షసుల గుణం ఉత్పత్తి అవుతుంది అని రాసారు. కురాన్‌లో అసలు ఆల్కహాల్ ముట్టకూడదు అని రాసారు. అదే భగవద్గీతలో ఐతే మందు, మాంసం నిషేధం అని రాసారు. బుద్ధుడు "అహింసా పరమో ధర్మ:" అని చెప్పారు. మహవీర్ చెప్పారు. "పంచాయమధర్మ" అందులో అహింసకు ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చారు. మాత గురువులు అందరు హింసను ఖండించారు. ఇది సత్యం.

ప్రశ్న : స్వామిజీ మరి మంచి సంతానం పొందాలి అంటే ఏ విధమైన నియమాలు పాటించాలి?

**స్వామీజీ జవాబు :** సంసారానికి 41 రోజుల ముందు గాయత్రి అనుష్ఠానాన్ని ప్రారంభించి ఆవునెయ్యితో అఖండదీపం పెట్టి భార్య భర్తలు ఇద్దరు మిత ఆహారం తింటూ 41 రోజులు బ్రహ్మచర్యం పాటించి గాయత్రి జపం చేస్తూ నాకు మంచి సంతానం కావాలి అని శు భసంకల్పం చేసి అనుష్ఠానం పూర్తి అయిన తరువాత ఒక మంచి రోజు చూసుకుని ఉ దయం యజ్ఞం చేసి రాత్రి సంసారం చేయాలి. స్త్రీ ప్రెగ్నెన్సీ అయిన తరువాత సంస్కార నియమాలను పాటిస్తూ భగవద్గీత, ఋషుల చరిత్రలు గర్భిణీ స్త్రీ చదవాలి. సంధ్యావందనం చేస్తూ గాయత్రి జపం చేస్తూ వీలైనంత యజ్ఞాలలో పాల్గొంటూ దైవ కార్యక్రమాలలో పాల్గొంటూ అందరితో ప్రేమతో ఉంటూ ప్రశాంతమైన జీవితం గడపాలి. గంగాపురాణాన్ని తప్పకుండా చదవాలి. అప్పుడు వారికి మంచి సంతానం ఉత్పత్తి అవుతుంది. ఆ సంతానం వల్ల ప్రపంచానికి మేలు జరుగుతుంది.

# పుంసవనము - సంస్కారము-2

## విశేష యజ్ఞం చేసి ప్రారంభించాలి

**2. గర్భిణీ తీసుకోవలసిన జాగ్రత్తలు :**

'చరకసంహిత'లో శరీర స్థానంలో పుంసవన సంస్కారము వర్ణన చేస్తూ గర్భపాతం కాకుండా గర్భస్థ సంతానం బలంగా ఉండటానికి గర్భిణీ తీసుకోవలసిన జాగ్రత్తలు, భోజన పదార్థముల వర్ణన ఉంది.

(సూత్రము - 40) గర్భవతి వంకరగా కూర్చోవడం, ఎగుడు దిగుడుచోట్ల తిరగడం, గట్టి ఆసనంపై కూర్చోవడం, గ్యాసు, మలమూత్రములను నిరోధించుట, మిక్కిలి కష్టమైన పనులు చేయుట, వేడి, చురుకైన వస్తువులను సేవించడం లాంటివి చేయకూడదు. చాలా ఆకలిగా ఉండటం వలన గర్భము ఎండిపోతుంది, చచ్చిపోతుంది లేక గర్భస్రావము అవుతుంది.

(సూత్రము - 41) దెబ్బ తగలటం వలన, గర్భంమీద వత్తిడి కలగడం వలన, గోతులు, బావులు, కొండకోనలు, లోయలు చూడటం వలన గర్భస్రావం కలుగవచ్చును. గర్భిణి శరీరము అతిగా కదలికలకు గురికాకూడదు. ఎడ్లబండి లాంటి ఎగుడు దిగుడు వాహనం వలన, భయంకర శబ్దము, ఇష్టంలేని మాటలు వినటం వలన కూడ అకాల గర్భస్రావం కలుగవచ్చును.

(సూత్రము - 42) గర్భిణీ దిశిమొలతో నిద్రించినా, అటు ఇటు తిరిగినా సంతానం పిచ్చిది కావచ్చును. గర్భవతి మిక్కిలిగా పోట్లాడేది, కొట్లాడేది అయితే సంతానానికి మూర్ఛలు రావచ్చును. గర్భవతి కలయికయందు ఆసక్తి గలదైతే సంతానం కామభావం గలది అవుతుంది. ఎప్పుడూ దిగులుతో ఉంటే సంతానం భయంగలది, తక్కువ ఆయువు గలది అవుతుంది. పరుల ధనాన్ని అపహరించాలనే కోరిక కలిగివుంటే, దొంగ, సోమరి, ద్రోహి, చెడుపనులు చేసే సంతానాన్ని కంటుంది. ఆమె కోప పడేది అయితే సంతానం కోపిష్టిది, మోసకారి, చాడీలు చెప్పేది అవుతుంది. ఆమె ఎప్పుడూ నిద్రపోయేది అయితే సంతానం సోమరి, మూర్ఖము, ఆకలి లేనిది అవుతుంది. సారాయి త్రాగేది అయితే సంతానం మతిస్థిమితం లేనిదవుతుంది. ఎక్కువగా తీపి తినేది అయితే సంతానానికి మధుమేహం (షుగరు) వస్తుంది. ఎక్కువ పులుపు తినేది అయితే సంతానానికి చర్మరోగం

వస్తుంది. ఎక్కువ ఉప్పు తినేదయితే సంతానానికి వెంట్రుకలు త్వరలో తెల్లబడుతవి. ముఖంమీద ముడతలు వస్తవి, బట్టతల వస్తుంది. మిక్కిలి మసాలా భోజనం చేసేదయితే సంతానం బలహీనులు, అల్పవీర్యము గలవారు, గౌడ్రాలు, నపుంసకులు అవుతారు. మిక్కిలి చేదు తింటే సంతానం ఎండురోగము, సన్నని అవుతుంది.

(సూత్రము - 44) ఎలా తల్లి కార్యకలాపాల వలన సంతానానికి రోగాలు సంక్రమిస్తవో అలాంటి కార్యకలాపాలు తండ్రి చేస్తే కూడా వీర్యం చెడిపోతుంది. అలాంటి చెడ్డ వీర్యం వలన అలాంటి చెడ్డ పిల్లలే పుడతారు.

గర్భవతి మొదటి రోజు మొదలుకొని ప్రతిరోజూ సంతోషంగా ఉండాలి. పవిత్రమైన ఆభరణాలు పెట్టుకోవాలి. తెల్లచీరలను ధరించాలి. మనసు ప్రశాంతంగా ఉంచుకోవాలి. అందరి మేలు కోరేదిగా ఉండాలి. దైవము, బ్రాహ్మణుడు, గురువును గౌరవించేదిగా వుండాలి. మురికియైన, వికృతమైన నీచ అవయవములను తాకగూడదు. చెడు వాసనలు, చెడు దృశ్యములకు దూరంగా ఉండాలి. బాధ కలిగించే మాటలను వినకూడదు. ఎండిన, పాచిన, కుళ్లిన అన్నాన్ని తినకూడదు. ఇంటినుండి బయటకు పోవడం, ఎవరూ లేని ఇంట్లో ఉండటం, సమాధులు, శ్మశానము, చెట్లు మొదలైన వాటి క్రింద ఉండటం, కోపపడటం, చెడుగా ప్రవర్తించడం, బిగ్గరగా అరవడం మొదలైన వాటిని వదిలి పెట్టాలి. గర్భానికి హాని కలిగించే విషయాలకు దూరంగా ఉండాలి. చరక సంహితలో చెప్పారు - మత్తుపదార్థాలు, మాంసము తినగూడదు, వాహనములు ఎక్కకూడదు. ఇంద్రియాలకు ఇష్టంకాని వాటిని దూరం నుండి వదిలిపెట్టాలి. ఇరుగు పొరుగువారు, బంధువులు చెప్పినట్లు చేయాలి.

పైన చెప్పినదానికి అర్థము ఏమిటి? సంతానము గర్భములో ఉన్నపుడు తల్లి చేసే ప్రతి విషయం దాని శరీర నిర్మాణంలో భాగమవుతుంది. ఇందువలన తల్లి సంతానం శరీర వికాసాన్ని దృష్టిలో పెట్టుకుని తన అన్నపానాదులు, కట్టు బొట్టు, వ్యవహారము సంతానంపై ఎలాంటి చెడు ప్రభావం పడకుండా చూచుకోవాలి.

తల్లి మనోభావాలు, చేష్టలు సంతాన నిర్మాణంలో తీవ్రమైన ప్రభావం చూపుతవి. సుశ్రుతుడు 'శరీరస్థానం'లో వ్రాశాడు - ఏ విధమైన శరీర దోషం చేతనైన గర్భవతి

యొక్క ఏ అవయవము బాధపడుతుందో గర్భంలో ఉన్న శిశువు యొక్క అదే అవయవము నొప్పి పెడుతుంది.

**3. శరీర వికాసానికి, సంతానానికి ఔషధోపచారములు :**

పుంసవన సంస్కారపు ముఖ్య ఉద్దేశ్యం గర్భంలో ఉన్న సంతానాన్ని రక్షించడం. ఇందువలన ఇప్పుడు చేసే ఉపచారాలన్నింటి లక్ష్యము గర్భం నిలవాలనే. సంస్కార విధిలో అశ్వలాయన గుహ్యసూత్రాలను పేర్కొంటూ దయానందుడు వ్రాశాడు – గర్భం నిలిచిన రెండవ లేక మూడవ నెలలో మఱ్ఱిచెట్టు ఊడ లేక కొమ్మ చిగురు తీసుకుని గర్భిణి కుడి ముక్కుతో వాసన చూడాలి. ఇంకా కొన్ని బలకరమైనవి అంటే తిప్పతీగ లేక బ్రాహ్మి ఓషధి తినిపించాలి. అక్కడ మఱ్ఱిచెట్టు, తిప్పతీగ వర్ణన ఉన్నది. అదే విషయం సుశ్రుతుని 'శరీరస్థానం'లో కూడా ఉన్నది. దీని అభిప్రాయం గర్భాన్ని స్థిరంగా ఉ ంచటానికి ఔషదోపచారంగా మఱ్ఱిచెట్టు, తిప్పతీగ వరకే పరిమితం చేయడం కాదు, అనుభవం గల వైద్యుని పరామర్శతో గర్భం నిలవడానికి భార్యాభర్తలు ఏ ఔషధాన్నయినా ఉపయోగించవచ్చు. గర్భం నిలిచిన తరువాత భౌతిక శరీరాన్ని స్థిరంగా ఉంచడానికి భార్యాభర్తలు ప్రయత్నించాలి.

'సుశ్రితసంహిత' దీనికొరకై న్యగోధాన్ని సూచిస్తుంది. న్యగోధము అంటే మఱ్ఱిచెట్టు. మఱ్ఱిని గురించి వ్రాశారు – అది వ్రణములను, పుండును నయం చేస్తుంది. విరిగిన ఎముకలను అతుకుతుంది. రక్తంలో వేడిని తగ్గిస్తుంది. స్త్రీ యోనిలోని దోషాలను పోగొడుతుంది. గర్భానికి బలం చేకూర్చుతుంది. తరువాత వ్రాశారు – తిప్పతీగ జ్వరాన్ని రానివ్వదు. వచ్చినా పోగొడుతుంది. వేడి, కఫము, దురద, అరుచి, వాంతి, దప్పిక, మంటలను నయం చేస్తుంది. మలబద్ధకాన్ని పోగొడుతుంది. ఏయే ఉపద్రవాలు గర్భస్థ దశలో వస్తాయో వాటినన్నింటినీ తిప్పతీగ నివారిస్తుంది.

**గర్భ దశలో గర్భాన్ని స్థిరంగా ఉంచడానికి ఈ క్రిందివాటిని పాటించాలి.**

1. మఱ్ఱిచెట్టు చిగురు లేక లేత కొమ్మను పాలలో మెత్తగా నూరి, ఆ రసాన్ని సంతానం కావాలనే స్త్రీ యొక్క కుడి ముక్కులో మూడు లేక నాలుగు చుక్కలు

వేయాలి. వాటిని బయటకు రానివ్వకూడదు.

2. మంచి బియ్యమును విసరి ముద్దగా చేసి, ఆ ముద్దను వేడి చేయాలి. వేడి చేసేటప్పుడు ఆ వేడిగాలిని ముక్కుతో పీల్చాలి. దీనిని పిండి, దూదితో తుడిచి, ముక్కులో పెట్టాలి.

**4. గర్భవతి బలానికి ఏమి తినాలి?**

(సూత్రము – 70) మొదటి నెలలో ఔషధం లేకుండా చల్లపరచిన పాలు త్రాగాలి. ఉదయం, సాయంత్రం మితమైన అన్నం తినాలి.

(సూత్రము – 71) రెండవ నెలలో గర్భవతి ఔషధంతో కూడిన పాలు త్రాగాలి.

**ఉదా :–** ఖర్జూర, ఏలకులు మొదలైన వాటిని పాలలో ఉడికించి ఇవ్వాలి. మూడవ నెలలో రెండు చెంచాలు తేనె, ఒక చెంచా నేయి పాలలో వేసుకుని త్రాగాలి. నేయి, తేనె సమంగా వేసుకోకూడదు. నాలుగవ నెలలో పాలలో ఒక తులం తాజా వెన్న కలుపుకుని త్రాగాలి. ఐదవ నెలలో పాలలో నేయి కలుపుకుని త్రాగాలి. 6వ, 7వ నెలలో కిస్‌మిస్, ఖర్జూర, ఏలకులు కలిసిన పాలలో కొంచెము నేయి వేసుకుని త్రాగాలి.

(సూత్రము – 72) 7వ నెలలో దురద పుడుతుంది. ముఖ్యంగా పొట్టపై చర్మమును చీల్చివేసే విధంగా దురద పుడుతుంది. ఈ సమయంలో స్త్రీ తన స్తనములకు, పొట్టకు మంచిగంధము పూసుకోవాలి. గోళ్లతో గీరుకోకూడదు. సాధ్యమైనంతవరకు దురదను ఓర్చుకోవాలి. ఓర్చుకోలేనపుడు నెమ్మదిగా చేతితో నిమరాలి. ఆ సమయంలో తియ్యని, వాత నాశని అయిన మెత్తని ఆహారాన్ని తినాలి. ఉప్పు తినగూడదు. మంచినీళ్లు త్రాగాలి.

(సూత్రము – 73) 8వ నెలలో పాలతో వండిన జవల జావ నేతిలో కలుపుకుని అపుడపుడు త్రాగాలి.

నిండు నెలలప్పుడు మలబద్ధకము లేకుండ చూసుకోవాలి. మలబద్ధకము పోవటానికి పాలలో గులకంద కలిపి వాడాలి.

# 3. సీమంతోన్నమన సంస్కారం

పుంసవన సంస్కారం తల్లి ధ్యాస అంతా సంతానం యొక్క శారీరక వికాసంపై కేంద్రీకరించటానిక చేసేది. సంతానం తల్లి పొట్టలో పెరుగుతున్నంత కాలము దాని శారీరక, మానసిక వికాసం కొరకు తల్లినే సాధనంగా చేసుకోవాల్సివస్తుంది. సంతానానికి శారీరక వికాసానికి పుంసవన సంస్కారము, మానసిక వికాసానికి సీమంతోన్నయన సంస్కారము చేయాలి.

## 1. సీమంతమంటే అర్థము ఏమిటి?

సుశ్రుత 'శరీరస్థానం' 6వ అధ్యాయంలో వ్రాశారు – శిరస్సు 5 కపాలములతో విభజించబడినది. వాటికి దెబ్బ తగిలిన, పిచ్చితనం వచ్చిన, భయం కలిగినా, పనిచేయకపోవడం వలన మరణం సంభవించవచ్చును. శిరస్సులో కపాలముల సందుల వలన దానిని సీమంతము అంటారు. శిరస్సులో మెదడు ఉంటుంది. దానితోనే మనము ఆలోచన చేస్తాము. సీమంతోన్నయనమునకు అర్థము మెదడు యొక్క ఉచ్చస్థితి. సీమంతోన్నయనంలో సంస్కారమునకర్థము తల్లి ధ్యాస మెదడు మీద కేంద్రీకరించే సంస్కారం. పుంసవన సంస్కారం శరీర వికాస సంస్కారము సీమంతోన్నయన సంస్కారం మానసిక వికాస సంస్కారము. ఈ రెండు సంస్కారాల వలన గర్భస్థ శిశువుకు శారీరక, మానసిక వికాసం కలుగుతుంది.

'సంస్కార విధి'లో వ్రాశారు – సీమంతోన్నయన సంస్కారంలో భర్త తన చేతితో తన భార్య వెంట్రుకలకు సువాసన నూనెను వ్రాయాలి. పాపట తీయాలి. దువ్వెనతో దువ్వాలి. జడ అందంగా వేయాలి. ఇద్దరు కలిసి యజ్ఞవేదిక దగ్గరకు రావాలి. దీని వుద్దేశ్యము భార్యాభర్తలు ఇరువురు తమ ధ్యాస సంతాన శారీరక, మానసిక వికాసం మీద కేంద్రీకరించాలి. వారు అర్థంచేసుకోవాలి – సంతానం యొక్క మానసిక వికాసం వారిపైనే ఆధారపడి ఉన్నదని. ఎలాంటి మానసిక జీవితం వారు గడుపుతారో దాని ముద్రే సంతానం మీద పడుతుంది. శాస్త్రకారులు తల్లిని ఒక మూసగా భావించారు. దీనిలో తల్లిదండ్రులు కోరిన సంతానాన్ని పోతపోయవచ్చును. ఈ సమయాన్ని గనక చేకూర్చుకుంటే సంతానం పుట్టిన తరువాత, బయట మంచి–చెడు పరిసరాల ప్రభావం మిక్కిలి బలీయంగా పని చేస్తుంది.

2. సీమంతోన్నయన సంస్కారము ఎందుకు చేయాలి?

(ఎ) మేము పైన చెప్పినట్లుగా సీమంతోన్నయన సంస్కారం యొక్క ఉద్దేశ్యం తల్లిదండ్రుల ధ్యాసను సంతానం యొక్క మానసిక వికాసంపై కేంద్రీకరించడమే. ఇందువలన స్పష్టమయేది సీమంతోన్నయనం సంస్కారానికి మంచి సమయము. గర్భస్థ శిశువు మెదడులోని అణువులు ఏర్పడే సమయము. సుశ్రుతుడు 'శరీరస్థానం'లో వ్రాశాడు – "పంచమే మన: ప్రతిబద్ధతరం భవతి, షష్ఠే బుద్ధి: సప్తమే సర్వాంగ ప్రత్యంగా విభాగ: ప్రవ్యక్తతర: అష్టమేఽ స్థిరీభవితి ఓజ: తత్ర జాత: చెన్నజీవేత్ నిరోజస్త్వాత్" – అనగా 5వ నెలలో మనసు ఎక్కువగా మేల్కొంటుంది. 6వ నెలలో బుద్ధి జాగృతమవుతుంది. 7వ నెలలో ప్రతి అవయవము బాగా కనబడుతుంది. 8వ నెలలో ఓజస్సు నిలకడగా ఉండదు. అందువలన 8వ నెలలో పుట్టే సంతానం ఓజస్సు లేకపోవడం వలన బ్రతకదు. దీనివలన స్పష్టమయేది – సుశ్రుతుడు చెప్పినదాన్నిబట్టి 5వ నెలలో గర్భస్థ సంతానం మెదడు ఇంతకు ముందుకంటే ఎక్కువ జాగృతమవుతుంది. ముందుకంటే ఎక్కువకు అర్థము – 4వ నెలలో మనసు లేక మెదడులోని నరాల కూర్పు ఏర్పడుతుంది. ఈ కారణంగానే సీమంతోన్నయన సంస్కారమునకు సమయము 4వ నెల నిశ్చయించబడినది. అందుకనే అశ్వలాయన గృహసూత్రాన్ని బట్టి దయానందడు ఉద్ధరణను ఇస్తూ, ఈ సంస్కార విధిలో వ్రాశాడు – చతుర్ధే మాసే సీమంతోన్నయనమ్.

**(బి) 6వ నెలకు కారణము** – సుశ్రుతుని పై ఉద్ధరణను బట్టి 'షష్ఠే బుద్ధి:' అని వ్రాశాడు. అనగా గర్భస్థ సంతానానికి 6వ నెలలో బుద్ధి వికసించడం మొదలవుతుంది. ఆయుర్వేదంలోని ఈ సిద్ధాంతాన్ని ఆధారంగా చేసుకుని 6వ నెలలో కూడా సీమంతోన్నయన సంస్కారము చేయవచ్చును. దీని ఉద్దేశ్యము కేవలము ఇప్పటినుండే తన సంతానం యొక్క మానసిక వికాసపు భారం కూడా తనమీద పడిందని తెలుసుకోవడం. ఇప్పటినుంచి ఆమె ఏ పని చేసినా ఆలోచించి చేయాలి. ఎందుకంటే ఆమె ప్రతి ఆలోచన ప్రభావం తన లోపల ఊపిరి తీసుకుంటున్న సంతానం మెదడు మీద తెలియకుండానే పడుతుంది.

**(సి) 8వ నెలకు కారణము** – 8వ నెల వచ్చేవరకు స్త్రీని 'దౌహృది' అని అంటారు. దౌహృదమునకు అర్థము రెండు హృదయములు గలది. ఒక హృదయము తన స్వంతము. రెండవది తన లోపలి సంతానానిది. 8వ నెల చేరుకొనేసరికి సంతానం యొక్క శరీరము, మెదడు, హృదయము ఈ మూడు తయారవుతవి. ఒకవేళ 4వ నెలలో సీమంతోన్నయనం

చేయకపోతే 6వ నెలలో చేయవచ్చును. 6వ నెలలో కూడా చేయలేకపోతే 8వ నెలలో చేయవచ్చును.

ఈ మూడు నెలల్లో ఏదో ఒక నెలను ఎన్నుకుని ఆ నెలలో ఈ సంస్కారం చేయాలి. ఎందుకంటే 4వ నెలలో మెదడు నిర్మాణ కణాలు ఏర్పడుతవి. 6వ నెలలో బుద్ధి వికసించడం మొదలవుతుంది. 8వ నెలలో శరీరము, మనస్సు, బుద్ధి, హృదయము ఈ నాలుగు తయారవుతవి. ఈ సమయంలోనే స్త్రీని 'దౌహృది' అని అంటారు. ఈ సమయం స్త్రీకి ప్రమాదకరము. ఎందుకంటే 8వ నెలలో సంతానం బ్రతకటం కష్టము. ఇందువలన 8వ నెలలో స్త్రీ సంతానము యొక్క శరీరము, మనస్సు, బుద్ధి, హృదయము ఈ నాలుగింటిని ఆరోగ్యంగా ఉంచుకోవాలి.

**3. 'దౌహృది' శబ్దము యొక్క విశేష మహత్వము :**

తల్లి, సంతానంలో ఒకే రక్తము ప్రవహిస్తుంది. తల్లి గర్భంలో సంతానం హృదయస్పందన టక్ టక్‌మని వినిపిస్తే అపుడు ఆమెను రెండు గుండెలు గలది (దౌహృది) అని అంటారు. ఆ సమయంలో గర్భస్థ సంతానం చైతన్యం, బహిర్గతమవుతుంది.

గర్భంలో సంతానం పెరిగేకొలదీ అందులో చైతన్యం వృద్ధి చెందుతుంది. గర్భంలో స్పందన మొదలవుతుంది. పంచేంద్రియాలలో కోరికలు కలుగుతవి. దాని హృదయం తల్లి బీజం నుంచే తయారవుతుంది. ఈ హృదయం రక్తాన్ని తీసుకువచ్చే, తీసుకుపోయే ధమనుల ద్వారా తల్లి హృదయంతో కలిసి ఉంటుంది. ఈ కారణంగానే తల్లి, సంతానానికి ఒకేరకమైన కోరిక కలుగుతుంది. ఈ సమయంలో తల్లి కోరికే సంతానం కోరిక అని తెలుసుకోవాలి. తల్లి హృదయం సంతానం యొక్క హృదయం ధమనుల ద్వారా కలిసి ఉంటవి. గర్భదశలో, ఆ తరువాత కూడ తల్లులు సీమసున్నం తింటూవుంటారు. పిల్లలు కూడ సీమసున్నం తింటారు. దీనికి కారణం పిల్లవాడు పెరగడానికి కాల్షియం (సున్నము) అవసరం. తల్లి పొట్టలోనున్న అతడు తల్లి శరీరం నుండి సున్నాన్ని పీల్చుకుంటాడు. ఇందువలన సున్నం తక్కువయి తల్లికి సున్నం తినాలనే బుద్ధి పుడుతుంది. పిల్లవానికి కూడ అది అవసరమే. అందువలన వాడు కూడా సీమసున్నం తినడం మొదలు పెడతాడు. దీనికి మంచి మందు బయోకెమిస్ట్రీలో కెలకోరియాఫ్రాంస్ 6 ఎక్స్. దీనిని 4, 5 గోళీలు ఒక రోజులో 4 లేక 5 సార్లు తీసుకుంటే పిల్లవానికి సున్నం కొరత తీరిపోతుంది.

**4. తల్లి, సంతానం కోరికల పరస్పర సంబంధము :**

గర్భ దశలో తల్లికి 4వ నెలలో రకరకాల పదార్థాలు తినాలనే కాదు, మానసిక దృష్టితో ఆమెలో రకరకాల కోరికలు పుడుతవి. దీనికి కారణం నాల్గవ నెలలో గర్భస్థ సంతానానికి మనసు తన పూర్వజన్మ సంస్కారాల కారణంగా క్రియాశీలమవుతుంది. వెనుకటి జన్మలోని సంస్కారాలు అస్పష్టంగా ఎదుటకు రాసాగుతవి. అవి తల్లిని కూడ ప్రభావితం చేస్తవి. వీటి కారణంగా తల్లిలో కూడ రకరకాల సంకల్ప వికల్పాలు కలుగుతవి. ఇదే సమయంలో తల్లి తన సంస్కారాల ముద్ర వేయడం తల్లి చేతిలోని పని. గర్భ దశలో ఇద్దరు ప్రాణులు తమ తమ సంస్కారాలను ఒకరింకొకరిపై వేయసాగుతుంటారు. సంతానములోని పూర్వజన్మ సంస్కారాలు నీడలాగా వస్తూ ఉంటవి. అతని సూక్ష్మశరీరంలో ఉంటవి. తల్లి ఈ జన్మ సంస్కారాలు ప్రబలరూపంలో ఉంటవి. ఈ సమయానికే ఇద్దరి హృదయాలు కలిసిమెలిసి ఉంటాయి. ఇప్పుడు తల్లి తన తీవ్ర సంస్కారాల ద్వారా గర్భస్థ సంతానములోని అస్పష్ట సంస్కారాలను రూపుమాపగలదు, తెంచగలదు. తల్లి వైపు నుండి ఏ ప్రయత్నం లేకపతే సంతానం తన వెనుకటి జన్మలోని సంస్కారాలే ప్రబలరూపం ధరిస్తవి. సీమంత సంస్కారాలు తల్లి గర్భంలో ఉన్న శిశువుపై తల్లి మనోభావాల ప్రభావం పడటానికే చేస్తారు. ఎందుకంటే ఇద్దరి హృదయాలు కలిగివుండటం చేత ఏ సంస్కారం చేతనైనా ప్రభావితం చేయవచ్చును. ఈ విషయాన్నే తల్లిదండ్రుల హృదయము కలిగించడానికి వైదిక సంస్కృతిలో 'దౌహృది' శబ్దాన్ని నిర్మాణం చేశారు. గర్భవతి తన హృదయంలోని భావాలను సంతానంపై ముద్రించగలదు. దీనిలోనే నవసమాజ నిర్మాణ రహస్యము దాగియున్నది.

**5. తల్లి మనోభావాల ప్రభావం సంతానం మీద పడటం :**

మానవుని నవనిర్మాణం కాగలదు. ఈ ఆలోచనను దృష్టియందుంచుకొని 16 సంస్కారాలు చేయడం కేవలం వైదిక సంస్కృతిలోనే కనబడుతుంది. ఇతర ఏ సంస్కృతిలోనూ లేదు. ఎక్కడైనా ఉన్నా అది వైదిక సంస్కృతి నుండి వెళ్లినదే. ఎందుకంటే ఒక నియమంగా, పద్ధతిగా ఎక్కడా లేదు. ఈ పద్ధతిగా పుట్టడానికి ముందే ఆరంభమయి, చనిపోయే వరకు మానవుడు ఆ పద్ధతికి బద్ధుడై ఉండాలి. ఎందుకంటే సంస్కార పద్ధతి నిర్మాతలకు సంస్కారాల ప్రభావంపై మిక్కిలి విశ్వాసం ఉంది. ఇందువలన వారు తమ నమ్మకాన్ని వేరు వేరు విషయాలపై వేరువేరుగా ప్రకటించారు. ఉదాహరణకు సుశ్రుతుని 'శరీరస్థానం'లో

ఈ క్రింది విషయాలు సంస్కార పద్ధతి నిర్మాతలకు సంస్కారాలపై వారికున్న దృఢవిశ్వాసాన్ని తెలుపుతున్నవి.

1. గర్భవతికి ఏ విషయంలో కోరిక ఉండదో, ఆమె సంతానానికి కూడ ఆ విషయంలో కోరిక ఉండదు. ఏ విషయంలో గర్భవతికి కోరిక ఉంటుందో అదే విషయంలో ఆమె సంతానానికి కూడ కోరిక ఉంటుంది.

2. ఏ స్త్రీకి గర్భ దశలో రాజ సందర్శన దౌహృదం కలుగుతుందో, ఆ ఇద్దరి హృదయాలలోనూ రాజ దర్శనమవుతుంది. ఆమె భాగ్యవంతుడు, ధనవంతుడైన కొడుకును కంటుంది.

3. మంచి మంచి వస్త్రాలు, పట్టుబట్టలు, చీరలు, ఆభరణాల మీద ఏ స్త్రీకి మనసుంటుందో ఆమె సంతానానికి కూడా ఆయా వస్తువులపైనే కోరిక ఉంటుంది.

4. ఏ గర్భవతి మనసు ఆశ్రమాలలో విహరిస్తుందో ఆమె ధర్మపరులైన సంతానాన్ని కంటుంది. ఎవరి మనసు దేవతాప్రతిమల మీద ఉంటుందో ఆమె అలాంటి సంతానాన్నే కంటుంది.

5. ఏ విషయాలు చెప్పలేదో అలాంటి విషయాలపై గర్భవతి మనసు ఉంటే అలాంటి శరీరము ఆచార - విచారాలు, కట్టు-బొట్టు-జుట్టు ఆమె సంతానానికి కూడ అబ్బుతవి.

సంస్కార పద్ధతి నిర్మాతల స్థిరమైన అభిప్రాయం ప్రకారం తల్లి సంస్కారాలు, మనోభావాల ప్రభావం సంతానం మీద నలుముఖాలుగా పడుతుంది. ఇందువలననే సీమంతోన్నయ సంస్కారమునకు మహత్వపూర్ణ స్థానము ఇవ్వబడినది. మనువు చెప్పాడు-

**యా దృశం భజతే నారీ సుతం సూతే తథా విధమ్ ।**
**తస్మాత్ ప్రజ విశుద్ధ్యర్థం స్త్రియం రక్షేత్ ప్రయత్నత: ॥**

గర్భవతి ఏరకమైన చిత్రాన్ని తన మనసులో చిత్రించుకొంటుందో ఆమె అలాంటి సంతానాన్నే కంటుంది. ఇందువలన ఉత్తమ సంతానానికి స్త్రీని మంచి వాతావరణంలో ఉంచాలి. అప్పుడే సంతానం ఉత్తమము, సంస్కారవంతము అవుతుంది.

# 4. జాతకర్మ

1. సంతానం పుట్టినపుడు చేసే కర్మలు :

**పిల్లవాని ముఖము, ముక్కు మొదలయినవి శుద్ధి చేయుట :** పుట్టక ముందు గర్భదశలో బాలుడు వేరే వాతావరణంలో ఉంటాడు. అతడు నోటితో అన్నం తినడు. ముక్కుతో గాలి పీల్చడు. అతని భోజనం బొడ్డు ద్వారా తల్లి నుండి తిన్నగా లభిస్తుంది. గర్భదశలో అతను నీటితో నిండిన ఒక సంచిలో మూయబడి ఉంటాడు. ఈ నీరు ముఖము లేక ముక్కులోకి పోకుండా అతని నోరు, ముక్కు శ్లేష్మముతో మూయబడి వుంటుంది. బాహ్య ప్రపంచంలోకి వచ్చిన తరువాత అతని నోటిని, ముక్కును శుభ్రం చేయాల్సి ఉంటుంది. ఎందుకంటే ఇపుడు అతనికి శరీర సంబంధము తల్లితో తెగిపోతుంది. ఇందువలన తల్లినుండి పోషకాహారము తేలికగా లభించదు. నోటిని శుద్ధిచేస్తే అతడు పాలు త్రాగగలడు. ముక్కును శుద్ధి చేస్తే అతడు గాలి పీల్చుకోగలడు. ఈ శుభ్రత తరచుగా నేర్పరియైన మంత్రసాని మెత్తని, శుభ్రమైన వస్త్రంతో చేస్తుంది. పిల్లవాని ముక్కులో, ఊపిరితిత్తులలో కూడ శ్లేష్మము (పలుచని పొర)తో నిండియుంటుంది. ఇందువలన వాంతి మొదలయినవి చేయించి, వాని శ్వాసకోశాలు, ముక్కు శుభ్రము చేయాల్సివస్తుంది. ఆయుర్వేదాన్ని బట్టి సైంధవ లవణాన్ని నేతిలో కలిపి ఇస్తే ముక్కు గాలిగదులు శుభ్ర పడుతవి.

జాతకర్మ సంస్కార ప్రాధాన్యతను గూర్చి బార్హస్పత్య సంహిత ఈ విధంగా ప్రశంసించినది. "జాతమాత్రే కుమారే తు జాతకర్మ విధీయతే, ప్రాక్ నాభికృంతనా త్పుంసో జాతకర్మ విధీయతే, యావన్మ ఛిద్యతే నాళం తావన్నాప్నోతి సూతకం, ఛిన్ననాళేతత: పశ్చాత్ సూతకం తు విధీయతే".

అనగా శిశువునకు బొడ్డు కోసిన వెంటనే తల్లిదండ్రులు మొదలగు వారికి సూతకము అనగా పురుటి దోషము వచ్చును. ఈ దోషముతో తండ్రి వేదమంత్ర పఠనంతో ఫలీకరణ హోమాలు చేయకూడదు. కనుక శిశువునకు బొడ్డుకోయకముందే యీ జాతకర్మ సంస్కారమును సమంత్రకముగా నిర్వహించవలెనని మహర్షుల ఆదేశం.

తండ్రియే జాతకర్మ సంస్కారమును చేయవలెను. అట్లు చేయుట వలన శిశువునకు పుట్టుకతోనే సంక్రమించే బాలారిష్టాది దోషాలు నశిస్తాయి. ఇంకా ఆ

శిశువునకు భావాకాలంలో తరచుగా రాబోయే రోగములు తొలగిపోతాయి. ఈ సంస్కార నిర్వహణ ప్రభావం వలన శిశువునకు దీర్ఘాయుష్య, సర్వ విధములైనటు వంటి అభివృద్ధులు అనే ప్రత్యేకాభ్యుదయములు ప్రాప్తించును. ఇంకా శిశువునకు జన్మకాలములో సంక్రమించిన "అమంగళ యోగములు" (యీ సంస్కార నిర్వహణ ప్రభావం వలననే) తొలగిపోవును. (ఇది ప్రత్యేక ప్రయోజనము) ఇక తండ్రి పురిటింటి గుమ్మానికి ముందు ప్రక్క అగ్నిని ప్రజ్వలింపజేసి అందు తౌడు + ఆవాలు కలిపిన ద్రవ్యాన్ని సమంత్రకముగా (అగ్ని ప్రజ్వలిస్తూన్నపుడు) అందు హోమం చేయవలెను. హోమం చేసిన ఆ ద్రవ్యం హుతమగునపుడు అగ్ని నుండి పరిమళ భరితమైన ధూపం (పొగ) వెలువడును. అట్టి పొగ సోకిన శిశువులకు శారీరక రుగ్మతలు ఉండవని మహర్షుల భావన.

జాతకర్మ తండ్రియే చేయవలెను. ప్రసవ వార్త విన్నంతనే తండ్రి తల స్నానము చేయవలెను. దుష్ట నక్షత్రాది జనన దోషములు లేనిచో తండ్రి తన కుల పెద్దలకు, దేవతలకు నమస్కరించి పుత్రుని లేక పుత్రిక ముఖము చూడవలెను. ఉత్తరాభిముఖుడై చన్నీటిలో బంగారు ఉంగరం వేసి, ఆ నీటితో స్నానము చేయవలెను. ఆ శౌచము (మైల) మధ్య శిశూదయమైనను, తండ్రికి, తత్కాలమందు స్నానదానాదులకును, జాతకర్మకును శుద్ధి యగును. స్నానము చేసి అలంకరించుకుని, బొడ్డు కోయకముందే, చనుబ్రాలు త్రాగక ముందే, ఇతరులు అంటుకోకముందే శిశువును కడిగి, తల్లి ఒడిలో ఉండునట్లు చేయవలెను, తనకు తోచిన దానాలు ఇచ్చునట్లు మనస్సులో సంకల్పించుకుని, తరువాత బొడ్డుకోసి, తల్లి దక్షిణ స్తనము సువర్ణ జలములతో కడిగి, శిశువునకు పాలు త్రాగించవలెను. స్త్రీ శిశువుకు జాతకర్మ మొదలు నామకరణము వరకు చౌలపర్యంతము మంత్రములు లేకుండా క్రియలు మాత్రమే చేయించవలెను. దుష్ట తిథి వార నక్షత్రముల యందు బిడ్డ జననమైనచో శాంతి, ఆజ్యవీక్షణము (నూనెలో ముఖం చూచుట) లేనిదే శిశువు ముఖము చూడరాదు. ఆడపిల్ల అయిన 13వ రోజు, మగపిల్లవాడైన 12వ రోజున ఊయలలో పరుండబెట్టవలయును. దీనికి పంచాంగశుద్ధి విచారించనవసరంలేదు. శిశువుకు మొదటిసారిగా ఆవుపాలను శంఖముతో పోయించుట చాలా మంచిది. దీనిని 'దుగ్ధపానము' అంటారు.

**బాలుని చెవిలో వేదోఽసి అని చెప్పుట :** బాలుని నాలుకపై ఓంకారము వ్రాయటానికి అర్థము అతని నోటి నుండి ఏది వెలువడినా అది అతనిని ఆధ్యాత్మికత వైపు

తీసుకెళుతుంది. కాని అతని నోటి నుండి ఆధ్యాత్మిక విషయములు అతనిలో ఆధ్యాత్మికము నిండి ఉన్నప్పుడే వెలువడుతాయి. ఇందువలన బాలుని చెవిలో తండ్రి చెబుతాడు "వేదోఽసి' నీవు జ్ఞానవంతుడవు. అజ్ఞానివి కావు. చెవిలో మంత్రం చెప్పే పద్ధతి అన్నిచోట్ల జరుగుచున్నది. చెవిలో మంత్రం చెప్పటానికర్థము రహస్య విషయము. తన హృదయంలో పదిలపరచుకొనివలసిన విషయము. ఏ గురువైనా తన శిష్యునికి చెవిలో రహస్య మంత్రాన్ని చెప్పినపుడు చెప్పేవాడు, చెప్పించుకునే వాడు దీనిని అర్థవంతంగా, ధార్మికంగా పాటించాలి. దీనిని ఎప్పుడూ భంగపరచకూడదు అని తెలుసుకుంటారు. తండ్రి కుమారుని చెవిలో నీవీ ప్రపంచంలో జ్ఞానివిగా ఉండు, అజ్ఞానివిగా ఉండకు అని పుట్టగానే ఉపదేశిస్తాడు. ఏ వైదిక సంస్కృతి బాలుడు పుట్టగానే జాతకర్మ సంస్కార రూపంలో బాలుని చెవిలో నీవు జ్ఞానివి కావాలని ఊదారో ఆ సంస్కృతిలో చదువు రానివారు ఉండగలరా? అది కూడ చెవిలో రహస్యంగా మంత్రరూపంలో చెప్పడం. రహస్యంగా చెప్పే విషయం బహిరంగంగా చెప్పే విషయం కంటే మహత్త్వము కలదై ఉంటుంది. మహమ్మదీయులు కూడ పిల్లవాడు పుట్టగానే రెండు చెవులలో 'అజా'ను చదువుతారు. అతని చెవులలో నాలుగుసార్లు 'అల్లాహో అక్బర్' అనే నాదాన్ని వినిపిస్తారు. రెండింటిలో శబ్దాలు వేరే అయినా పిల్లవాడు పుట్టగానే అతని చెవులలో వారి భావాలకనుకూలంగా ఆధ్యాత్మిక శబ్దాలను పలకడం రెండింటిలో సమానం.

జాతకర్మ సంస్కారములో బంగారపు పుడకతో నెయ్యి, తేనె నాకించుట, ఈ సంస్కారములోనే నాలుకపై 'ఓమ్' వ్రాయుట, చెవులలో 'వేదోఽసి' అనే మంత్రాన్ని ఊదటం. తినడం, త్రాగడం, విందులు వినోదాలు, ప్రపంచ సుఖాలు అనుభవించడం, భౌతిక జీవితంతోపాటు ఆధ్యాత్మిక జీవితాన్ని గడపటం, రెండింటిని కలుపుకుపోవడం ఒక గొప్ప సంస్కృతి సూచకము. ఈ సంస్కృతి కేవలం భౌతికవాదం కాదు. పరలోకానికి స్థానం లేనిది కాదు. కేవలం ఆధ్యాత్మికం కాదు. ఈ లోకానికి స్థానము లేనిది కాదు. ఇది యథార్థవాద సంస్కృతి. ఇహ లోకము, పరలోకము రెండింటి సమన్వయము కలది.

**బాలుడు పదానికి అర్థము :**

సంస్కార విధిలో జాతకర్మము నుండి మొదలుకొని వేదారంభం వరకు బాలుడు శబ్దాన్ని ప్రయోగించాము. ఇక్కడ బాలుడు శబ్దము జాతి వాచకము. ఇక్కడ బాలుడు బాలిక రెండింటికి వర్తిస్తుంది. అదే ఇష్టము. కర్ణవేధ సంస్కారములో వ్రాశారు – బాలుని

చెవి లేక ముక్కు కుట్టే సమయము అయితే బాలుని ముక్కు కూడ కుట్టాలి. ముక్కు కుట్టడం బాలికలకే తగును. ఇందువలన స్పష్టమయేది సంస్కార విధిలో ఎక్కడెక్కడ బాలుడు శబ్దము ఉపయోగించబడిందో అక్కడక్కడ సందర్భాన్ని బట్టి బాలుడు, బాలిక ఇద్దరునని అర్థం చేసుకోవాలి. ఇందువలననే ఉపనయన సంస్కార సమయంలో బాలకుడు శబ్దాన్ని ప్రయోగించినపుడు బాలిక ఉపనయనం కూడ బాలుడు శబ్దంలో దాగి ఉన్నది. ఇదే విధంగా ఆశీర్వాదము ఇస్తూ కూడ అంశము మారుస్తూ ఆశీర్వదించాలి.

# 5. నామకరణము

నామకరణము ముందు విశేష హోమము ఉంటుంది. హోమము చేసి ప్రారంభించాలి.

**"వైదికై: కర్మభి: పుణ్యై: నిషేకాదిద్విజన్మనాం !**
**కార్య శ్శరీర సంస్కార: పావన: ప్రేత్య చేహ చ !!"**

మన సంస్కృత వేద సాంప్రదాయాలు – సంస్కారములను గూర్చి మనుస్మృతికారుడు చెప్పిన శ్లోకమిది –

తా॥ వేదమంత్రములతో కూడిన గర్భాదానాది సంస్కార కర్మలచే ద్విజుడు సంస్కృతుడై ఈ లోకమందును, పరలోకమందును కూడ పాపక్షయము చేసుకొనుట ద్వారా పవిత్రుడై ఇహపరశ్రేయస్సులను తేలికగా పొందగలుగుచున్నాడు.

**"ఏకాదశే౽హని నామకరణం కుర్యాత్" (ఆప.గృ.)**

తల్లిదండ్రులు తమ పుత్రునకు ముందుగా 'వేద' నామమును పెట్టుటవలన ఆ బిడ్డ నూరేళ్ళు జీవించునని –

**"వేదో వై పుత్రనామా౽సి సజీవ శరదశ్శతమ్"**

అని వేదమంత్రం తెలియజేయుచున్నది. నామకరణమునకు సోమ, బుధ, గురు, శుక్ర వారములు 2, 3, 5, 7, 10, 11, 13 తిథులు – అశ్వి, రో, మృ, పున, పుష్య, మఖ, హస్త, స్వాతి, చిత్త, అనూ, శత, ఉత్తరాత్రయ తారలు – అష్టమశుద్ధిగల వృష, సిం, వృశ్చి, కుంభ లగ్నములు మంచివి. బిడ్డపుట్టిన 11, 21, 29 రోజులలో గాని 3వ నెలలో గాని నామకరణము చేయాలి.

ఇల్లు వాకిలి శుద్ధి చేసుకుని ఆవు పంచకము గృహమునందు చల్లి, మామిడి ఆకులు తోరణము కట్టవలెను. రాత్రి ప్రథమ యాయమునందే తండ్రి మొదలగు వారు స్నానముచేసి విఘ్నేశ్వరుని పూజించవలయును. పళ్ళెములో బియ్యము పోసి తూర్పు ముఖముగా పీటలు వేసి వాటిపై తెల్లటి వస్త్రములు దక్షిణ అగ్రములు కాకుండా ఉత్తర అగ్రములుగా ఉండునట్లు పరచి, వసంతం కొద్దిగ చిలకరించవలెను. భార్యా భర్తలను తూర్పు ముఖముగా కూర్చుండబెట్టి ఒక పళ్ళెములో బియ్యముపోసి, దానిపై కలశము ఉంచి దానిపై మామిడి ఆకులు, కొబ్బరికాయ ఉంచవలెను. కలశము చుట్టూ పసుపు, కుంకుమలను ఉంచవలెను. పసుపుతో గణపతిని చేసి గణపతిపూజ, యిష్ట దేవతలను పూజించి పుణ్యాహవచనము చేసి ఆ నీళ్ళు ప్రసూతికా గృహమంతయు చల్లవలెను, ఒకవేళ అంతకు ముందు జాతకర్మ చేయనిచో అప్పుడు తేనె, నెయ్యి కలిపి జాతకర్మ చేయించవలెను.

తరువాత పెద్దలకు పాదపూజచేసి తాంబూలము నూతన వస్త్రములు ఇచ్చి నమస్కరించవలెను. భార్య పుట్టింటి వారిచ్చిన వస్త్రములు ధరించి నాంది అను కర్మ చేయవలెను. తరువాత పళ్ళెంలో బియ్యంపోసి, బంగారు ఉంగరంతో దానిలో దక్షిణ దిశనుంచి ఉత్తరదిశకు మూడు గీతలు గీసి - ముందు శ్రీకారము రాసి, ఒక్కొక్క గడిలో మాస, నక్షత్ర, వ్యవహార నామములు రాయవలెను.

మాస నామము అన్న గడిలో ఆ పేరు రాసి నక్షత్ర నామము అన్నచోట జన్మ నక్షత్రాన్ని బట్టి రాయాలి. ఏ నక్షత్రం ఏ పాదంలో జన్మిస్తే పేరు మొదటి అక్షరం ఏది వస్తుందో ఆ పట్టిక క్రింద ఇవ్వబడింది. ఆ అక్షరముతో మొదలయ్యే పేర్లు అన్నీ పెట్టవచ్చును. అది వ్యవహార నామంగా ఇష్టం లేకపోతే వ్యవహార నామం మరొకటి రాయవచ్చును.

3 రకముల పేర్లు రాసి పూజించిన తర్వాత వ్యవహార నామం అంటే మామూలుగా పిలిచే పేరు 3 సార్లు పిల్లవాని చెవిలో చెప్పవలెను. పెద్దలకు అందరికి అక్షతలు ఇచ్చి అందరి ఆశీర్వాదములు పొందవలెను. శిశువుకు ఆభరణములు చేయించినవారు ఈ సమయంలోనే ధరింపచేయాలి. వస్త్రములు, మొలత్రాడు ధరింపచేసి కర్పూరంతో హారతి ఇస్తారు. సాయంత్రం శిశువుని ముత్తైదువుల సమక్షంలో ఉయ్యాలలో వేస్తారు. ఈ వేడుకలన్నీ దేశాచారాన్ని బట్టి ఉంటాయి.

**శిశువుకు మొలత్రాడు కట్టుటకు :** పురిటి శుద్ధి రోజునగాని, నెల పురిటి శుద్ధి

రోజునగాని మొలత్రాడు కట్టుట ఆచారము, అశ్వి, రోహి, మృగ, పుష్య, ఉత్తరాత్రయము, హస్త, అనూ, మూల, రేవ, మంగళవారము మంచిది. పురిటిలో ఊడిన శిశువు బొడ్డును మొలత్రాడునందు ధరింపజేయుట మంచిది.

రెండు పేర్లు పెట్టడంలో చరకుడు మరొక అభిప్రాయంలో ఈ విధంగా చెప్తాడు. "కుమారస్య పితా ద్వొ నామ్నీ కారయేత్ నాక్షీ త్రికం నామ అభిపాయకంచ" అనగా కుమారునికి తండ్రి రెండు పేర్లు పెట్టాలి. ఒకటి బాలుడు పుట్టిన నక్షత్రాన్ని సూచించేది. రెండవది అతని జీవిత లక్ష్యాన్ని సాధించేది.

దిశ జ్ఞానంవైపు మరలాలి అని ప్రయత్నం చేశారు. ఈ ఉద్దేశ్యంతోనే అతని చెవిలో వేదోఽసి (జ్ఞానవంతుడవు) ధ్వనిని ప్రతిధ్వనింప చేశారు. ఇప్పుడు వారు అభావాలన్నింటిని దృష్టిలో పెట్టుకుని బాలుని నామకరణ సంస్కారం చేయు పూనుకున్నారు. వారు బాలునకు వారి భావాలు వ్యక్తిపరచే దానిని బాలుని కూడ నిరంతరం అలా కావడానికి ప్రేరణ ఇచ్చే ఒక మంచి పేరును పెట్టాలనుకుంటున్నారు. వచ్చిపోయే వ్యక్తులందరు ఆ కొత్తగా వచ్చిన బాలుని ఆ పేరుతో పిలిచి తమ ప్రేమను వ్యక్తపరచినపుడు ప్రతిసారి ఆ పేరులో శబ్దము ఆ బాలుని హృదయాన్ని, మెదడును ఆ పేరు అర్థానికి అనుకూలంగా ప్రభావితం చేసేటట్లుగా ఉండాలి. ఈ కారణంగానే పేరు గొప్పతనాన్ని దృష్టిలో ఉంచుకుని వైదిక ధర్మంలో దీనిని ఒక భాగంగా చేశారు. పేరు చెప్పుకోవడానికి ఒక శబ్దం మాత్రమే. కాని శబ్దానికి పెద్ద మహత్వమున్నది. ఆ మహత్వమేమిటి?

**3. శబ్ద ప్రభావము :**

శబ్ద ప్రభావాన్ని స్పష్టంచేస్తూ వ్రాసినదాని సారాంశము ఇది. శబ్దము గాని, వాక్కు గాని మనసు, కర్మ ఈ రెండింటి మధ్యలో ఉన్నది. **"యన్మవసా మనుతే తత్ వాచా వదతి యత్ వాచా వదతి తత్ కర్మణా కరోతి"** దేనిని మనం మనసుతో ఆలోచిస్తామో దానినే వాక్కు ద్వారా శబ్ద రూపంలో చెబుతాము. దేనిని శబ్ద రూపంలో చెబుతామో దానినే కర్మతో చేస్తాము. దీనికి అర్థము శబ్దానికి ఒకవైపు మనసు కూర్చొని ఉంది. రెండవ వైపు కర్మ కూర్చొని ఉంది. శబ్దము ఈ రెండింటి మధ్యలో కూర్చొని ఉంది. ఈ గొలుసుకు మూడు కడియములు (సంకెలలు) అనుకుంటే, ఒకవైపు మనసు అనే కడియము, రెండవ వైపు కర్మ అనే కడియము ఉంది. మధ్యలో శబ్దము అనే కడియము ఉంది. మధ్య

కడియమును కదిలిస్తే రెండు వైపుల కడియములు కదలసాగుతవి. ఇదే విధంగా శబ్దము అనే కడియము మనసు, కర్మల మధ్యలో పడి ఉన్నదో దానిని కదిపితే మనసు, కర్మ రెండింటిపై ప్రభావం పడుతుంది. ఈ దృష్టితో చూస్తే ఆలోచనను సూక్ష్మ శబ్దము లేక సూక్ష్మ వాక్కు అనవచ్చును. వాక్కును, శబ్దాన్ని స్థూల విచారము అనవచ్చును. ఇదే విధంగా శబ్దము, వానిని సూక్ష్మ కర్మ అని కూడ అనవచ్చును. కర్మను స్థూల వాని లేక స్థూల శబ్దము అనవచ్చును. ఆలోచన, శబ్దము, కర్మలను ఒకదాని నుంచి మరొకదానిని విడదీయటం కష్టము. ఈ భావాన్ని వ్యక్తపరుస్తూ చెప్పాడు – శబ్దము ఒకరకమైన పనియే. పని ఒక రకమైన శబ్దమే. శబ్ద ప్రభావము మనసు, శరీరంపై పడుతుంది. ఆస్పత్రులలో రోగులకు జపమంత్రం లాగా ఈ వాక్యాన్ని వల్లింపజేస్తారు. "నేను ప్రతిరోజూ అన్ని విధాలుగా బాగుపడుతున్నాను". వైదిక సంస్కృతిలో కూడ జపము మీద ఎక్కువ శ్రద్ధ చూపటంలోని రహస్యము ఇమిడివున్నది. శబ్ద ప్రభావము శరీరము, మనస్సు మీద పడుతుంది. మంత్రము ప్రతి పుస్తకంలో ఉంటుంది. కాని గురు ముఖంగా, గురు మంత్ర రూపంలో శబ్దాల ద్వారా విన్నప్పుడు అవి మన జీవితాన్ని బాగుచేస్తవి. ఇదే శబ్ద మహత్వమంటే. ఉదాహరణకు ఉపనిషత్తులు చదివే ప్రతి వ్యక్తి 'సోఽహం' శబ్దాలు చదువుతాడు. కాని వాటిని గురువు ఏకాంతంలో మంత్ర రూపంలో చెప్పినపుడు మనకవి అద్భుతమైన పెన్నిధి అవుతాయి.

శబ్దము ఏమిటి? శబ్దము పేరుకు రెండవ నామము. ప్రతి శబ్దము ఒక పేరు. దానితో మనము ఏదో అర్థాన్ని గ్రహిస్తాము. మనము బాలునికి ఏదైనా పేరు పెట్టినపుడు, వానికి ఒక శబ్దాన్ని ఎన్నుకున్నపుడు బాలునికి అది జీవితాంతం ఉపయోగపడుతుంది. ఏ శబ్దము జీవితమంతా ఉపయోగిస్తామో దానిని ఎంత జాగ్రత్తగా ఎన్నుకోవాలో స్వతహాగా తెలిసి ఉండాలి.

**4. పేరును ఎన్నుకొనుట, ఏరుకొనుట :**

సంతానానికి పేరును ఏరుకొనుట గొప్ప విషయము. మన సంతానం విషయంలో అన్ని కోరికలు ఇమిడేటట్లుగా, తీరేటట్లుగా ఒక పేరు పెట్టాలి. ఆ పేరున పిలుస్తుంటే – ఓ బాలుడా! నీ నుంచి మా ఈ ఆశలు తీరాలి అన్నట్లుగా ఉండాలి. దానితోపాటు ఆ పేరు వినగానే మన బంధువులు, కుటుంబీకులు కూడ మన సంతాన విషయంలో ఏమి కోరికలున్నవో తెలుసుకోవాలి. అతని తల్లిదండ్రులు ఏ ఆశలు, ఆకాంక్షలు వారి

హృదయాలలో పదిలపరచుకొని అతనికి ఆ పేరు పెట్టారో మనం తెలుసుకోవాలి. మనల్ని ఎరిగినవారు తెలుసుకోవాలి. మన సమాజం తెలుసుకోవాలి. మన సంతానం కూడ స్వయంగా తెలుసుకోవాలి. తన పేరును బాలుడు మాటిమాటిక వింటున్నప్పుడు అతని హృదయం, మెదడు తప్పనిసరిగా ఆ పేరులో దాగున్న అర్థ భావనతో ప్రభావితం కావాలి. ఈ దృష్టితో పేరును ఎరుకనే విషయంలో శాస్త్రాలలో చెప్పిన విషయాలు చాలా మహత్వం గలవి. ఈ విధానాలను ఈ క్రింది విధంగా భాగాలుగా పంచవచ్చును.

ఎ. **జడవస్తువులు, పశువులు, పక్షుల పేర్లు పెట్టకూడదు** – మనం తరచుగా మన బాలబాలికల పేర్లు జడవస్తువులు, పశువులు, పక్షుల పేర్లుపెడుతూ ఉంటాము. వుదాహరణకు గంగారాము, జమునాదాసు మొదలగునవి జడములైన నదుల పేర్లమీద. గరుడారాము, శుకారాము మొదలయినవి పక్షుల పేర్లమీద. ఇంకా డోరీలాలు, ఛేదీలాలు మొదలయిన నిరర్థక పేర్లు పెడతారు. అనేక పట్టణాల, దేశాల పేర్లు కూడా పిల్లలకు పెడుతుంటారు. ఉదాహరణకు విలాయతీరాము, తాహోరీరాము, జర్మనదాసు మొదలగునవి. ఈ పేర్లు ఏ అర్థాన్నీ తెలుపవు. మనుస్మృతి (3–9)లో చెప్పారు – నక్షత్రము, చెట్లు, నదులు, కొండలు, పక్షులు, పాములు మొదలగువాటి పేరు గల కన్యను వివాహం చేసుకోకూడదు. దేని పేరు జడవస్తువును తెలుపుతుందో దానిలో బాగుపడాలనే కోరిక ఎలా కలుగుతుంది? అలాగే పశు పక్షుల విషయంలో అలాంటి పేర్ల వలన బాలునిలో ఉన్నత భావాలు కలుగనేరవు.

బి. **ఉన్నత భావాలు కలిగించే పేర్లు పెట్టాలి :** పేరు పెట్టడానికి రెండు ఉద్దేశ్యాలుంటాయి. ఒకటి బాలుడు, బాలికను పిలవడానికి రెండోది అతని హృదయంలో ఉన్నత భావాలు కలిగించటానికి. జీవితంలో అతడు ఎలాంటివాడు కావాలనేది అనుభూతి కావాలి. వుదాహరణకు వీరసేనునకర్థము యుద్ధములో వీరుడుగా పోరాడుతాడు. వేదవ్రతునకర్థము వేదముల స్వాధ్యాయి చేయు వ్రతముగలవాడు. సత్యవ్రతునకర్థము జీవితాంతము సత్యమును ఆచరించువాడు.

ఇలాంటి పేర్లతో కొంత సద్భావన మేల్కొంటుంది. ఏ భావంతో పేరు పెట్టబడిందో ఆ భావము వ్యక్తిలో లేకపోతే ప్రయోజనమేమి? చరిత్రలో చెడు సంబంధమున్న వ్యక్తుల

పేర్లు పెట్టగూడదు. ఉదాహరణకు దుర్యోధనుడు, శకుని, జయచంద్రుడు మొదలైనవారి పేర్లు. భారతదేశ చరిత్రలో ఇవి చెడ్డ పేర్లు అయిపోయాయి.

"తత్ర సాభిప్రాయికం నామ" – పేరు అభిప్రాయంతో కూడినదై ఉండాలి. ఈ విషయం కేవలం వైదిక సంస్కృతిలోనే చూస్తాము. ఇతరులు అర్థంలేని పేర్లు పెట్టుకుంటారు. యావత్తు పడమటి దేశాలలో పేరు పెట్టే ఉద్దేశ్యము కేవలం పిలవడానికే కాదు అనే విషయమే తెలియదు. సంతానం పేరు ద్వారా ఒక ఉన్నత లక్ష్యాన్ని కూడ ఉంచడం అవసరమని తెలుసుకోవాలి.

# 6. నిష్క్రమణ

నిష్క్రమణకు అర్థము బయటికి రావడం. ఇప్పటి వరకు బాలుడు నాలుగు గోడల మధ్యలో చిక్కుకుని ఉన్నాడు. కాని ఇంటి వరకే, ఇరుకు వాతావరణంలోనే అతడు ఉండేవాడు కాదు. శరీరము, మనసు వికసించటానికి చల్లని గాలి, సూర్యుని వెలుతురు ఎంత అవసరమో అంత వస్తువు మరొకటి లేదు. ఈ ఉద్దేశ్యంతో ముందుంచుకొని బాలునికి ఒక ధార్మిక సంస్కార రూపాన్ని కల్పించారు. ఎందుకంటే అతడు చల్లని గాలిలో సూర్యుని ప్రాణదాయకమైన కిరణాలలో తిరగాలి. స్వయంగా అతను తిరుగుతూ, పరుగెత్తుతూ ఉండే దశకు చేరుకోలేదుగా. ఇందువలన తల్లిదండ్రులు ధార్మిక కారకంగా జతపరచారు. అలాగా వారు బాలుని ఇంటి నాలుగు గోడల లోపలి నుండి బయటకు తీసుకురావాలి. అతనిని తెరవ (శుభ్రమైన) గాలిలో, లేత ఎండలో తిప్పాలి.

**1. సూర్యుని వెలుతురు, తెరప గాలి మహత్వము :**

ప్రపంచంలో ఏదైనా, ఎంతైనా శక్తి ఉన్నదంటే అది సూర్యుడే. సూర్యుని వెలుగు అతని కిరణములు ప్రపంచంలో ప్రసరించకపోతే ఆరోగ్యంగా ఉండటం అసంభవము. సూర్యుడే జీవనశక్తికి పెన్నిధి. ఆ స్థానాన్ని మరే వస్తువూ తీసుకోలేదు. ఎందుకంటే ప్రపంచంలోని ప్రతి కణమునకు శక్తినిచ్చేవాడు, ఉత్పత్తి స్థానము సూర్యుడే. ఇందువలన మనము సంతాన జీవితాన్ని నిలిపి, బాలుడిని దీర్ఘ జీవిని చేయాలంటే సూర్యుని వెలుతురులో ఉండగలిగినంత ఎక్కువసేపు ఉంచాలి.

సూర్యుని జీవనదాయక కిరణముల వలన తాజా గాలిలో జీవనశక్తి ప్రసరిస్తూ ఉంటుంది. ఇందువలన ఆరోగ్యానికి, దీర్ఘజీవితానికి స్వచ్ఛమైన మంచి గాలిలో తల్లి, పిల్లవాడు సాధ్యమైనంత ఎక్కువసేపు గాలి పీల్చుకోవాలి.

మానవ జీవితము శ్వాస మీద ఆధారపడి ఉంది. శుద్ధ వాయువు పీల్చుకోవడం వలన అనేక లాభాలున్నవి. సూర్యకిరణములతో కూడిన మంచిగాలి యొక్క దీర్ఘ శ్వాస సౌరశక్తితో నిండియుంటుంది. సౌరశక్తితో కూడిన మంచిగాలిని మనం ఊపిరితిత్తులలో నింపినపుడు మన ప్రతి అవయవములో విద్యుచ్ఛక్తి ప్రవహిస్తుంది. ఈ శక్తి శరీరాన్నే కాకుండా మనసును కూడా ప్రభావితం చేస్తుంది. ఈ శక్తి శరీరము యొక్క నవనిర్మాణము చేస్తుంది. శరీరరూప యంత్ర వ్యవస్థను కొత్తదిగా చేస్తుంది. సూర్యుని వెలుగుచే ప్రభావితమైన గాలి జీవనశక్తి చేత నిండి ఉంటుంది. దీనిని భారతీయ శాస్త్రాలలో ప్రాణశక్తి అన్నారు. ఈ వాయువులో సౌరశక్తి సోకని వాయువు కంటే జీవితాన్ని ఆరోగ్యవంతం చేయడానికి, దీర్ఘ జీవితాన్ని కలిగించడానికి అద్భుతమైన సామర్థ్యము ఉన్నది. ఏ సంస్కార పద్ధతి యొక్క ఉద్దేశ్యము నవమానవ నిర్మాణమో, అందులో శరీరం యొక్క ఒకొక్క సెల్ (అణువు)ను జీవనశక్తితో నింపేటటువంటి సంస్కారాన్ని మరచిపోతే ఆ పద్ధతి అసంపూర్ణంగానే ఉండిపోతుంది. నిష్క్రమణ సంస్కారం యొక్క అభిప్రాయం బాలుని మెదడులో జీవయాత్ర మొదటి దశలోనే ఈ సంస్కారము యొక్క చెరగని ముద్ర వేయాలి. అప్పుడే సౌరశక్తితో కూడిన ప్రాణశక్తితోనే అతడు ఆరోగ్యవంతుడు గాను, దీర్ఘజీవిగాను కాగలడు.

**2. నిష్క్రమణ సంస్కార సమయము :**

పురిటి ఇంటిలో నుండి బయటకు వచ్చే సమయాన్ని గూర్చి గోభిల గృహ్యసూత్రము అభిప్రాయం ప్రకారం పుట్టిన తరువాత మూడవ శుక్లపక్షము తదియనాడు నిష్క్రమణ సంస్కారము చేయాలి. దీనికి అర్థం – చాంద్రమానం ప్రకారం పుట్టిన రెండు మాసముల 3 రోజుల తరువాత ఈ సంస్కారము చేయాలి. పారస్కర గృమ్యసూత్రము ప్రకారం పుట్టిన నాలుగో నెలలో ఈ సంస్కారము చేయాలి. ఈ రెండింటిలో మౌలికమైన భేదము ఏమీ లేదు. దీని అభిప్రాయము ఏమిటి? బాలుడు బలహీనంగా ఉంటూ, మూడు నెలల తరువాత బలంగా ఉంటే 2 నెలల తరువాత అతనిని బయటి గాలిలోకి, సూర్యుని

ఎండలోనికి తీసుకురావడం, తీసుకుపోవడం చేయాలి. ఇంతకు ముందు బాలుని బయటకు తీసుకురావడం, తీసుకుపోవడంలో చలి గాని, వేడి గాని తగులవచ్చును. నిష్క్రమణ సంస్కారాన్ని ధార్మిక సంస్కార రూపంలో 16 సంస్కారాలలో స్థానం కల్పించటానికి కారణం ఈవైపు తల్లిదండ్రుల ధ్యాస తప్పనిసరిగా మారాలి.

యువకుడైన మీదట బాలుని ఆరోగ్యము కొరకు అనేక నియమాలు ఏర్పాటు చేస్తారు. ప్రొద్దుటపూట వ్యాయామము చేయాలి. సాయంకాలము హాకీ, ఫుట్‌బాల్ మొదలయిన ఏదో ఒక ఆట ఆడాలి. దీనివలన అతని శరీరం బలకరం అవుతుంది. ఇదే విధంగా బాలుడు పుట్టగానే సంస్కార రూపంలో ఇది అవసరమని చెప్పబడింది. 2, 3 మాసముల తరువాత అతను కలుషిత, పరిమిత ఇంటి లోపలే ఉండక, ఇంటి బయట శుభ్రమైన గాలిలో, నీరెండలో మెల్లగా తిరగాలి.

శరీర శాస్త్రజ్ఞులు చెప్పేది ఏమిటి? మన శరీరము సక్రమంగా వికసించాలంటే కాల్షియం, ఫాస్పరసు శరీరంలో ఇమిడిపోవాలి. రక్తంలో కాల్షియం తక్కువైన కొద్దీ మనుష్యునిలో కోపము, చికాకు ఎక్కువవుతుంది. విటమిన్ 'డి' లేపోతే కాల్షియం శరీంలో ఇమడదు. విటమన్ 'డి' పాలలో గాని, పెరుగులో గాని లేదు. ఇది సూర్యుని ఎండలోనే దొరుకుతుంది. ఇందువలన సూర్యుని కిరణములు సేవించుట అవసరము. ఇందువలన విటమిన్ 'డి' లభిస్తుంది. బాలుడు కాల్షియం లోపించుట వలన బలహీనుడు కాదు. ఈ విధంగా కాల్షియం, ఫాస్పరసు రెండూ శరీరంలో ఎండ ప్రభావం వలన ఇమిడిపోతవి.

**3. త్వం జీవ శరద: శతమ్ వర్ధమాన:**

నిష్క్రమణ సంస్కారంలో చదవబడే మంత్రము లన్నింటిలో పల్లవి (ఆధారము) ఒకటి 'త్వం జీవ శరద: శతమ్ వర్ధమాన:' అన్నదాంట్లో ఇమిడిపోతవి. తల్లిదండ్రులు, బంధువులు, చుట్టాలు అందరి మనోభావాలు సంతానం నూరేండ్లు బ్రతకాలని, నిరంతరం వృద్ధి చెందాలని, వర్ధమానుడవాలనే ఉంటుంది. సంస్కారంలో మొదటి మంత్రంలో వస్తుంది. 'మా అహం పౌత్రం అఘంనిగాయ' నా కుమారుడు చిరంజీవి అగుగాక. నాకంటె ముందు కొడుకు పోయాడనే దు:ఖం నాకు లేకుండుగాక. ఆ తరువాత మంత్రంలో 'ఆత్మావై పుత్రనామాసి సజీవ శదరశ్శతమ్' నీవు నూరు సంవత్సరముల వరకు జీవించుము. ఆ తరువాత మంత్రంలో కూడ రెండవమారు చెప్పబడింది. 'అసౌ జీవ శరద: శతమ్' సంతానం చెవిలో చెప్పబడింది. 'అస్మై శతం శరద: జీవసే' సంతానానికి సూర్యుని

చూపెడుతూ చెప్పారు 'జీవేమ శరద: శతమ్ వర్ధమాన'. ఎందుకంటే ఈ సంస్కారంతో సంతానము ఇంటిలోనుండి బయటకు వచ్చి బాహ్యప్రపంచంలోకి అడుగిడతాడు. ఇందువలన ఇలా కోరడంలో అతను జీవిత క్షేత్రంలో అతని జీవితం ఎంత దీర్ఘం కావాలంటే ఏ లక్ష్యాన్ని పెట్టుకుని ఇతడు పుట్టాడో దానిని పూర్తిచేసుకొని అతను ఈ జీవనయాత్రను ముగించాలి. ఇతని జీవనయాత్ర మధ్యలోనే ఆగిపోకూడదు. ఇతని జీవిత లక్ష్యం అర్థాంతరంగా ఆగిపోకూడదు.

## 7. అన్నప్రాశనము

**"అన్నప్రాశన మర్భకస్య శుభదం మా స్యేవయుగ్మే శుభే!**
**షష్ఠాదావథ పంచమాది విషమే మాసే వధూనాం శుభే"** (పూర్వకాలామృతము)

తా॥ మగపిల్లలకు 6 మొదలగు సరిమాసములలోను, ఆడపిల్లలకు బేసి మాసములలోను అన్నప్రాశనము చేయుట శుభప్రదమైనది.

ఆపస్తంబ మహర్షికూడా పూర్వకాలామృతకారుని వలెనే "జన్మనోధి షష్ఠే మాసి..." అని, అన్నప్రాశనకు మగపిల్లలకు 6వ మాసమే శ్రేష్ఠమైనదని తెలియజేసినాడు.

"ముఖ్యకాలపరిత్యాగాత్ శిశు ర్గుణవిహీనవాన్ ।
అత: షణ్మాసత: కుర్యాత్ అన్నప్రాశన మాదరాత్ ॥"

పై విధంగా ముగ్గురు ప్రామాణికులు ఏకగ్రీవముగా మగపిల్లలకు అన్న ప్రాశనము 6వ మాసమే మిక్కిలి శ్రేష్ఠమైనదిగా చెప్పారు. 6వ మాసములో తప్పక అన్నప్రాశన చేయించాలి.

మగ పిల్లలకు, 6, 8, 10, 12 నెలలలోను, ఆడపిల్లలకు 5, 7, 9, 11 నెలలలోను అన్నప్రాశనము చేయాలి. లగ్నశుద్ధి, దశమశుద్ధి వృషభ, మిథు, కటక, కన్యా, ధనస్సు, మీనరాసుల లగ్నములలో చేయవలెను. అశ్విని, రోహిణి, పునర్వసు, పుష్యమి, హస్త, చిత్త, స్వాతి, అనూరాధా, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, రేవతి, ఉత్తరాభాద్రా మొదలగు నక్షత్రములు మంచివి.

ముందుగా గణపతి పూజ చేసిన తరువాత పరమేశ్వరుని, విష్ణుమూర్తిని, సూర్యచంద్రులను, అష్టదిక్పాలకులను, భూదేవిని పూజించవలెను. బిడ్డ తల్లిదండ్రులు

తూర్పు ముఖముగా చాపపై కూర్చుండవలెను. శిశువును తల్లి ఒడిలో కూర్చోబెట్టుకొనవలెను. బంగారము, వెండి, కంచు మొదలగు ఏ పాత్రలోనైనా పాలతో వండిన పాయసమును ఆ పాత్రలో ఉంచి, పెరుగు, తేనె ఆ పాయసంలో కలుపవలెను. తండ్రి కుడిచేతితో బంగారం ఉంగరం పట్టుకుని దానితో ఆ పాత్రలోని పాయసమును శిశువునకు తినిపించవలెను. ఈ విధంగా మూడుసార్లు తినిపించిన తరువాత నాల్గవసారి చేతితో తినిపించవలెను. ఆ తరువాత తల్లి, మిగతా పెద్దలు, అదే విధంగా చేయాలి. అన్నప్రాశన కార్యక్రమము ఈ విధంగా పూర్తి చేయాలి.

## 8. చౌలము - చూడకర్మ

'చౌలం అనగా పిల్లవాని తలపై శిఖల నుంచుట. అని అర్థము. హోమ పూర్వకముగా 3 గాని, 5 గాని వారి కులాచార ప్రకారము పిల్లవాని తలపై శిఖల నుంచుట. ఇది సమంత్రకము, హోమములతో కూడినది కూడాను.

**"జన్మనోధి తృతీయే వర్షే చౌలం పునర్వస్వో:"**

అని ఆపస్తంబమహర్షి తెలియజేసినాడు.

**"చూడాకర్మద్విజాతీనాం సర్వేషామేవ ధర్మత: ।**
**ప్రథమే బ్దే తృతీయే వా కర్తవ్యం శ్రుతిచోదనాత్ ॥**

ప్రస్తుత కాలములో 'కేశఖండనమే' చౌలమని కొందరు తలుస్తున్నారు. ఇది సరికాదు. కారణము మంత్రయుక్తముగా జరిగినదానికే "చౌలము" అని వ్యవహారము. అట్టి కర్మచేతనే కర్తకు ముందు కాలంలో పితృకర్మలయందు అధికారము కలుగును. ఈ విషయాన్ని అందరు తప్పక గుర్తుంచుకోవాలి.

## కేశఖండన

పుట్టు వెంట్రుకలు తీయుటకు ముందు ప్రత్యేకమైన హోమం చేయాలి.

పుట్టు వెంట్రుకలు ఆడపిల్లలకు సరినెల, మగపిల్లలకు బేసి నెలలయందు తీయించాలి. మొదటి సంవత్సరములో కాని, 3, 5, సంవత్సరములలో ఉత్తరాయణము పగలు 12 గంటలలోపు మేనమామచేత పుట్టు వెంట్రుకలు తీయించాలి.

తూర్పు ముఖముగా తల్లి ఒడిలో కూర్చుండబెట్టుకొనవలెను. చల్లని నీటిని, వేడి నీటిని తీసుకుని కేశములను తడపవలెను. తర్వాత వెన్నతోకాని, పెరుగుతోకాని కేశములను తుడిచి ఎడమ చెవి నుండి మొదలుపెట్టి, ప్రదక్షిణముగా జుట్టు తీయవలెను. దర్భలు మూడు తీసుకుని కత్తిరించి పారవేయవలెను. శిరస్సు మధ్యన కొన్ని వెంట్రుకలు వుంచవలెను. ఎవరి ఇంటి ఆచారమును బట్టి కొద్ది మార్పులు చేయవచ్చును. కేశములు తీయుట పూర్తి అయిన తరువాత శిశువునకు స్నానము చేయించి, నూతన వస్త్రములు ధరింపజేసి, యథాప్రకారము తల్లి ఒడిలో కూర్చుండబెట్టి, గోధుమలు, బియ్యము, 4 మూకుళ్ళ ధాన్యము క్షురకునకు (మంగలివారికి) ఇవ్వవలెను. పురోహితునికి, పెద్దలకు అందరకు నమస్కరింపచేసిన తర్వాత, దక్షిణ తాంబూలాదులు ఇచ్చి పురోహితుని ఆశీర్వాదమును కూడా పొందవలెను. హారతి ఇచ్చిన తర్వాత ఒడి నుండి తీసి దేవునికి నమస్కరింపజేయవలెను.

దేవాలయాలలో పుట్టు వెంట్రుకలు తీయువారు కూడా ఈ ఆచారము పాటించవచ్చును. సోమ, బుధ, గురు, శుక్రవారములు మంచివి. అశ్విని, మృగశిర, పుష్యమి, శ్రవణం, ధనిష్ట, శతభిషం నక్షత్రాలు మంచివి. జ్యేష్ఠ మాసమున జ్యేష్ఠా నక్షత్రమున పుట్టినచో జ్యేష్ఠునకు పుట్టువెంట్రుకలు తీయకూడదు. తల్లి గర్భిణిగా ఉన్నప్పుడు కూడా ఈ సంప్రదాయం చేయకూడదు.

## 9. కర్ణవేధ (చెవులు కుట్టించుట)

సంస్కారాల వరుసలో చెవులు కుట్టించుట 9వ సంస్కారము. కర్ణవేధమునకు అర్థము చెవులను కుట్టటం. వాటికి రంధ్రం వేయటం. ఒకప్పుడు భారతదేశంలో చెవులు కుట్టించుకునే పద్ధతి చాలా ప్రచారంలో ఉండేదని తెలుస్తుంది. ఇందువలన దీనిని సంస్కారాల వరుసలో చేర్చారు. ఈనాడు చాలా తక్కువమంది తమ పిల్లలకు ఈ సంస్కారాలు చేయిస్తున్నారు. ఇప్పుడు ఇది సంస్కార రూపంలో లేదు. చెవులు కుట్టించుకునేవారు కంసాలిని గాని, తెలిసిన ఏ వ్యక్తినైనా గాని పిలిపించుకుని చెవులు కుట్టించుకుంటున్నారు. బాలురకంటే బాలికలు తరచుగా చెవులు, ముక్కులు కుట్టించుకుంటారు. ఎందుకంటే చెవులు, ముక్కులకు సొమ్ములు పెట్టుకునే రివాజు బాలికలు, స్త్రీలలో ఎక్కువగా ఉంది. పూర్వకాలంలోనైతే పెద్దవారు. ముసలివారు కూడా చెవులకు పోగులు ధరించేవారు.

**2. కర్ణవేధ మహత్వము :**

కర్ణవేధ మూడవ లేక ఐదవ సంవత్సరంలో చేయాలి. సుశ్రుతుడు వ్రాశాడు "రక్షా భూషణ నిమిత్తం బాలస్య కర్ణౌభిద్యోతే". చెవులు కుట్టించడం వలన బాలునికి రక్షణ కలుగుతుందని. రక్షణ ఏవిధంగా కలుగుతుంది? ఇది ఆలోచించాలి. అనేక మంది వ్యక్తుల అనుభవంలో చెవులకు రంధ్రం వేయటం వలన పేగులతో సంబంధమున్న ఏదో ఒక నరం చెదరుతుంది, గాయపడుతుంది. ఈ నరం చితకడం వలన పేగు జారడం ఉండదు. హెర్నియా అంటే ఏమిటి? పేగులో కొంత భాగము అండకోశము సంచిలోనికి జారుతుంది. దీనినే హెర్నియా అంటారు. పిల్లవాడు పుట్టినపుడు వాని అండకోశములు సంచిలోనికి దిగవు. ఆ రెండు పేగుల క్రింద పడివుండవు. తరువాత ఒక రంధ్రం గుండా అవి క్రిందకు సంచిలోనికి దిగుతవి. ఈ రెండు రంధ్రాలగుండా పేగులో కొంత భాగము జారి వస్తే దానినే పేగు జారడం లేక హెర్నియా అంటారు. సుశ్రుతుడు చెబుతాడు – చెవులు కుట్టిస్తే ఈ రోగము రాదు అని. సుశ్రుతుడు చికిత్సా స్థానములో వ్రాశాడు – "శంఖోపరిచ కర్ణాంతే త్యక్త్వా యత్నేన సీవనీమ్, వ్యత్యయాసాత్ శిరోభిధ్యేత్ అంత్ర వృద్ధి నివృత్తయే" అనగా శంఖ (కణత) పైన చెవి చివర రెండు కలిసిన చోటను వదలి వ్యత్యయంతో నరాన్ని కుట్టడం వలన పేగు పెరగడం, జారడం నయమవుతుంది. వ్యత్యయము అంటే కుడిప్రక్క పేగు జారడాన్ని ఆపటానికి ఎడమ చెవిని కుట్టాలి. ఎడమ వైపు పేగు జారడాన్ని ఆపటానికి కుడి చెవిని కుట్టాలి.

# 10. ఉపనయనము

"ఉపనయనం విద్యార్థస్యశ్రుతిత్ స్సగ్గ్స్కార:" –ఆప. ధర్మసూత్రం అనగా వేదాధ్యయనము కొరకు శ్రుతిమంత్రములచేత చేయబడు సంస్కారమే 'ఉపనయనము' అనబడును.

**"అగ్నికార్యా త్పరిభ్రష్టా: సంధ్యోపాననవర్జితా: ।**
**వేదం చైవా – నధీయానా: తే సర్వే వృషలాస్మృతా: ॥"** – పరాశరస్మృతి

వేదాధ్యయనము చేయని బ్రాహ్మణునకు 'వృషలుడు' అని పేరు. వృషలుడు అనగా శూద్రుడు అని అర్థము. కనుక బ్రాహ్మణ బ్రహ్మచారులకు వేదాధ్యయనము నిత్యమైనదీ, ఆవశ్యకమైనదీ కూడాను.

ఆచార్యుడు (తండ్రి) వటువును గాయత్రీమంత్రోపదేశం చేయించుట యిందు ప్రధానమైనది. ఈ పరమార్ధం 'ఉపనయనం' అను పేరులోనే ఉన్నది. కనుకనే అన్ని సంస్కారముల కంటెను ఈ సంస్కారమునకు ప్రత్యేక ప్రధాన్యత సంతరించుకొన్నది.

ఉపనయనకార్యమును మూడు రోజులు తప్పక చేయవలెనని శాస్త్రసమ్మతం.

"త్ర్యహమే తమగ్నిం ధారయంతి...."

అనగా ఉపనయనం మొదటిరోజు ప్రాత:కాలంతో ప్రారంభించి సంధ్యా వందనం అగ్ని కార్యములను ప్రాత:స్సాయంకాలములలో మూడు రోజులు వరుసగా చేయవలెనని ఆపస్తంబ సూత్రం తెలిపినది.

"వాసశ్చతుర్ధీముత్తరయాదత్తే" అనే మరో సూత్రము. మొదటి రోజున వటువునకు కట్టిన వస్త్రమును అనగా దీక్షావస్త్రమును ఆచార్యుడు నాల్గవ రోజున విప్పి మరొక వస్త్రమును కట్టవలెను. ఈ విధి వాక్యం కూడా 'ఉపనయనం 3 రోజులు చేసిన పిమ్మట మేథాజనన సంస్కారమును నాల్గవ రోజున చేయవలెను". అని నిర్దేశిస్తుంది. ఈ మేథాజననం చేసిన పిమ్మట గాని 'ఉపనయనం' పూర్తికాదని సూత్రకారుల ఆశయం. ఈ శుభకార్యము తప్పనిసరిగా 3 రోజులు చేయవలెనని శాస్త్రాలు శాసించుచున్నవి

**ఉపనయన విధానము :** ఉపనయనమనగా ఆచార్యుని వద్దకు తీసుకుని వెళ్లుట అని అర్ధము. ఇది గాయత్రీ ఉపదేశము ప్రధానముగ జరుగు కర్మ విశేషము. ఉపనయనము కాక పూర్వము యధేచ్ఛముగనున్న జీవితమునకు కట్టడి ఏర్పడును. మూత్ర పురీషోత్సర్జనాదుల యందు విశేష శుద్ధి, ఆచమనము చేయుట పాటించబడవు. ఉల్లి, వెల్లుల్లి, చద్ది అన్నము తినుట మొదలగునవి చిన్నవి దోషములుగా పరిగణింపబడవు. మహా దోషములుగా చెప్పబడిన మాంస భక్షము, ఛండాల రజస్వలాదులను స్పృశించుట, వారి అన్నము తినుట, మద్యపానాదులు ఉపనయనమునకు ముందైనను దోషములుగనే పరిగణింపబడును.

ఉపనయనము కాక ముందు వేదము చదువరాదు. తల్లిదండ్రుల అంత్యక్రియలు ప్రాప్తించినచో మంత్రము ఉచ్చరించవచ్చును అదియు చౌలము అయిన రెండు మూడు సంవత్సరముల తర్వాత మాత్రమే. ఉపనయనమునకు మూఢము, దక్షిణాయనం పనికిరావు. అనధ్యయన రహితమైన 2, 3, 5, 7, 10 తిధులు అశ్వి, రోహి, మృగ, పున,

పుష్య, ఉత్తరాత్రయం, హ, స్వా, అనూ, శ్ర, ధ, శత, రేవతీ తారలు మంచివి. తల్లి దండ్రులకు తారాబలం-చంద్రబలం ప్రధానంగా చూడాలి. లగ్నానికి కేంద్రంలో పాపులుగాని, చతుర్థంలో రవిగాని అస్సలు పనికిరాదు. అష్టమశుద్ధి ఉండితీరాలి.

**ఉపనయనము చేయుటకు అర్హులు :** ఉపనయనము చేయుటకు ముఖ్యుడు తండ్రి, తండ్రి లేనిచో తాత చేయవచ్చును. అతడును లేనిచో పినతండ్రి, సహోదరుడు, ముగ్గురు పురుషులు లోగా ఉన్న జ్ఞాతులు, మేనమామ, మొదలగు సపిండులు, దూరపు బంధువులు, సగోత్రులు, క్రమముగా అర్హత కలిగి యుందురు. కనిష్టులు అనర్హులు ఎవ్వరు లేనిచో పురోహితుడే చేయవచ్చును. ఆ పురోహితుడు శ్రోత్రియుడై ఉండవలెను.

**'జన్మన జాయతే శూద్ర: సంస్కారై: ద్విజ ఉచ్యతే ।**
**విద్యత్వచ్చాపి విప్రత్వం త్రిభి: శ్రోత్రియ ఉచ్చతే'**

ఉపనయనము చేయువారు 1012సార్లు గాయత్రి జపము చేయవలెను. ఇది శాస్త్రసమ్మతం.

**ఉపనయనమునకు ముఖ్య కాలము :** "గర్భా-ష్టమేషు బ్రాహ్మణ ముపనయీత" (అపస్తంబ సూత్రం) అనగా తల్లి గర్భములో ఉన్న 9 మాసములను కలిపి లెక్కచూచినచో వటువునకు 8వ సంవత్సరం రావలెను. అనగా 7 సం॥ల 3 మాసములు + 9 గర్భమాసములు కలిపినచో 8వ సం॥ వచ్చును.

దీనినే "గర్భాష్టమ సంవత్సరం" అంటారు. ఇదియే సరియైన కాలము. ఇక 'గర్భాఽ మేషు' అనే బహువచన నిర్దేశమునుబట్టి 'గర్భషష్ఠ, గర్భసప్తమ, గర్భాష్టమ అనే విధంగా బహువచనమునకు అవసరమైన 3 సంఖ్య వస్తుంది. దీనిని బట్టి గర్భషష్ఠ సంవత్సరం అనగా 5 సంవత్సరాల 3 మాసములకు గర్భగతమాసములు 9 కలుపగా గర్భషష్ఠ సంవత్సరం అనేది వస్తుంది. ఇదే విధంగా గర్భసప్తమ, గర్భాఽ ష్టమ సంవత్సరాలు వస్తాయి. బ్రాహ్మణ బాలురకు 5 సంవత్సరాల 3 మాసముల వయస్సు వచ్చినప్పటి నుండి ఉపనయనమునకు ముఖ్యకాలము ప్రారంభమై వటువునకు 8వ సంవత్సరం ఆఖరివరకు ఈ ముఖ్యకాలం ఉంటుందని తెలుసుకోవాలి.

**"ఆషోడశాద్బ్రాహ్మణస్య అపతితా సావిత్రీ, అతఊర్ధ్వం పతితసావిత్రీకా భవంతి, నైన ముపనయేత్..."** – మనుస్మృతి

ఇక ఉపనయనమునకు తుదిగడువు 16వ సంవత్సరం. ఈ గడువు దాటినచో అట్టి వటువునకు 'ఉపనయనము'నకు కూడా అర్హత ఉండదని మనుస్మృతికారుడు ఇలా చెప్పినాడు.

1. 16వ సంవత్సరం పూర్తికానంతవరకు వటువునకు గౌణపక్షంగా 'ఉపనయనము' చేయవచ్చును.

2. వటువునకు 16వ సంవత్సరం కూడా దాటినచో అట్టి వటువు 'పతితసావిత్రీకు'డౌతాడు.

3. అనగా అట్టివానికి – గాయత్రీ మంత్రోపదేశమునకు అర్హత నశిస్తుంది. అంటే అట్టి వానికి ముఖ్యమంత్రోపదేశము చేసిన తండ్రికి దోషము కలుగుతుంది. కనుక 16 సం॥లు దాటినవానికి 'ఉపనయనము' చేయరాదని భావము.

తల్లి రజస్వల అయినచో ఉపనయనము చేయకూడదు. బద్దెతో కూడిన వస్త్రము ఉతికి ధరింపవలెను. వడికిన నూలుతో యజ్ఞోపవీతము తయారు చేయవలెను. 96 బెత్తలు చొప్పున 3 పోగులు తొడమీద పురి ఎక్కించి, తిరుగ మూడు పేటలుగా వేసి దిగువకు పురి ఎక్కించినచో 9 పోగులు కలిగినదగును. అది మూడు పేటలుగా చుట్టి 2 కొసలు కలిపి గట్టిగా ముడివేయవలెను. దానిని స్థనముల కూర్ధ్వ భాగమునను, నాభికి దిగువను ఎప్పుడును చేర్పరాదు.

**'సిద్ధేమంత్రా: ప్రవోక్తవ్యా'** అనునట్లు యజ్ఞోపవీతమును మంత్రములచే అభి మంత్రించి గాయత్రి మంత్రం పఠిస్తూ బ్రహ్మముడి యందు బ్రహ్మ, విష్ణు రుద్రులను ధ్యానించి నమస్కరించవలెను. ఎడమ భుజముపై వేసి కుడి చేతికి కింద వేలాడునట్లు ధరించినచో దానిని "ఉపవీతము" అందురు. కంఠమునందు దండవలె ధరించిన దానిని "నివీతి" అందురు. కుడిభుజముపై వేసి ఎడమచేతి క్రిందికి వచ్చునట్లు ధరించిన దానిని ప్రాచీనావీతి అందురు. దేవకార్యములకు ఉపవీతముగను, మనుష్యకార్యములకు నివీతిగను పితృకార్యములకు ప్రాచీనావీతిగను ధరింపవలెను.

వటువుకు దర్భలతో చేసిన మొలత్రాడును మూడుచుట్లుగా నడుముకు కట్టుదురు, వటువు ధరించు దండము పలాశ దండము. మోదుగకర్ర, ఇది వటువు పాదములనుండి తలవరకుగానీ, కనీసము ముక్కువరకైనా ఉండవలెను.

**ఉపనయన వేదిక :** వటువు మూరతో 4 మూరల ఎత్తు కలిగి, నాలుగు వైపుల మెట్లు కలిగి ఉండాలి. నాలుగువైపులా అరటి స్తంభములు మొదలగు వానితో అలంకరించాలి. మినపగింజంత నీటిన అరచేతియందు ఉంచి త్రాగుటను ఆచమనము అందురు.

ఆజ్యపాత్రకు ఉత్తర భాగమున వటువుచేత ఆచమనము చేయించి, ప్రణీతపాత్రకు పశ్చిమముగా ఆచార్యుడు ఆయన కుడి భాగమున వటువును కూర్చుండ బెట్టుకొనవలెను. తరువాత దర్భలు చుట్టూ పరుచుట మొదలు, స్రువ పాత్ర తుడుచువరకు చేసి, యజ్ఞోపవీత ధారణము మొదలు ఆచమనము వరకును చేయవలయును. శిష్యుని దోసిలిలో జలము స్రవించుట మొదలు (ఇది కొన్ని ప్రాంతములందు మాత్రమే చేయుదురు) సమిధాదానము పర్యంతము చేసి అగ్నికి ఉత్తర భాగమున గాయత్రీ ఉపదేశము చేయవలెను. గురువు తూర్పు ముఖముగా, శిష్యుడు పడమర ముఖముగా కూర్చుండవలెను.

వటువు తన ప్రవరచెప్పి కుడిచెవిని ఎడమ చేతితో ఎడమచెవిని కుడిచేతితో పట్టుకుని తలవంచి నమస్కరించవలెను. తల్లిదండ్రులకు, పెద్దలకు అభివాద పూర్వకముగా పాదపద్మములకు నమస్కరించవలెను.

అశౌచము కలవానికి, వపనము చేయువానికి, తలంటుకొన్న వానికి, స్నానము చేయుచున్నవానికి, జపపూజాదులు చేయుచున్న వారికి, జలము భిక్షాన్నముతో ఉన్నవారికి, నమస్కరించకూడదు. పొరపాటున అట్లు నమస్కరించినచో ఉపవాసముండవలెను.

**"భవతీ భిక్షాందేహి" అని స్త్రీలను, భవాన్ భిక్షాం దదాత్"**

అని పురుషులను యాచింపవలెను. కంకణ ధారణము, అంతరపటము, కృష్ణాజినము, యజ్ఞోపవీతము, హోమము, జలాంజలి, సూర్యనిరీక్షణము, భిక్షా యాచనము సమిధారోపనము, చెవిలో గాయత్రీ ఉపదేశము, హృదయమును తాకుట, దర్భమొలత్రాడు. మోదుగ దండధారణము, బ్రహ్మోపదేశం, ధర్మోపదేశం, హోమశేషం, సమావనం, మాతృభిక్షా, ఇవన్నీ కూడా ఉపనయనమందు ముఖ్యాంశములు.

**ఉపనయన కార్యక్రమము :** ముందుగా పీటలపై తెల్లని వస్త్రము పరచి పసుపు నీళ్ళు చల్లి ఆ పీటలపై తల్లి దండ్రులను తూర్పు ముఖముగా కూర్చుండబెట్టాలి. పళ్లెములో

బియ్యము పోసి, రెండు కలశములకు మామిడాకులుంచి, ఒక టెంకాయ కలశంపై ఉంచి, బియ్యము ఉంచిన పళ్లెములో కలశం ఉంచవలెను. పసుపుతో గణపతిని చేసి గణపతి పూజ, స్వస్తి వచనాదులు జరిపించి, పెద్దలకు పాదపూజచేసి నమస్కరించి, తాంబూలాలు అందజేసి పెద్దల ఆశీర్వాదము పొందవలెను. పుట్టినింటి వారును, తల్లి పక్షము వారు అందించిన నాందీ వస్త్రములు కట్టుకుని ఉపనయన కార్యాదులు జరుపవలెను. కంబడి దారములు, తెల్లదారము పేని, వాటికి పసుపు కొమ్ములు కట్టిన వాటిని కంకణములందురు. తెర అడ్డముచేసి బియ్యము పిడికిటితో పట్టుకొనిన వటువు కుడిచేతికి కంకణము కట్టవలెను. తరువాత అగ్నిని స్థాపించి చౌల హోమము చేయించెదరు. దీని వలన బ్రహ్మత్వం కలుగును. తరువాత కాషాయవస్త్రధారణము దేవతల అనుగ్రహము కొరకు చేయించెదరు.

తెల్లటి వస్త్రము 4 మూరలు కలది గోచీకి, పైన కప్పుకొనే వస్త్రము, శిరస్సునకు ఉష్ణీషముల పేట, పసుపు చింతపండు పులుసుతో తడిపి ఆరవేసి కట్టించెదరు. తరువాత జింక చర్మమును ధరింపచేయుదురు. యజ్ఞోపవీత ధారణ సమయమున పెద్దలు అక్షతలు వేసి ఆశీర్వదించి యజ్ఞోపవీత ధారణముచేసి, హోమము చేయుదురు.

హోమము అయిన తర్వాత అగ్నికి ఉత్తరము వైపు తూర్పు ముఖముగా వటువు అతనికెదురుగా ఆచార్యుడు కూర్చుండి ఆచార్యుడు మనస్సును హృదయమును చిక్కపట్టి, వటువునకు శుచిత్వము ప్రసాదించుటకై అతని చేతులు నీటితో నింపి, తన దోసిలిని కూడా నీటతో నింపుకొని, సూర్యదేవునికి సూర్య మంత్రము పఠించి, తన అంజలి నీటిని శిష్యుని అంజలిలో విడిచెదరు. తరువాత శిష్యునిగా స్వీకరించుటకు వటువు హస్తమును గ్రహించును. కుడిచేతిని వ్రేళ్ళతో గురువు పట్టుకుని శిష్యుని సూర్యదర్శనము చేయించును. తరువాత ఆచార్యుడు వటువు, ఎదురెదురుగ నిలబడి వేదోక్త ప్రశ్నోత్తరములు జరిపెదరు. గురువు ఆత్మశక్తిని శిష్యునియందు ప్రవేశపెట్టుటకై శిష్యుని హృదయస్థామందు చేయి ఉంచి తరువాత అగ్ని కార్యమును చేసి సంధ్యావందనము చేయించును.

తరువాత దర్భతో పేనిన తాడుతో 3 చుట్లు మొలత్రాడును చుట్టి మూడు ముడులను వేయుదురు.

**1. ఉపనయనమునకు వయస్సు :**

ఉపనయన సంస్కారంలో ముఖ్య విషయం యజ్ఞోపవీతం ధరించడం. యజ్ఞోపవీతం ధరించడం గృహ్యసూత్రముల ప్రకారం బ్రాహ్మణ బాలునకు 8వ సంవత్సరంలో, క్షత్రియ బాలునికి 11వ సంవత్సరంలో, వైశ్య బాలునికి 12వ సంవత్సరంలో చేయాలి. "అష్టమే వర్షే బ్రాహ్మణం ఉపనయేత్, ఏకాదశే వర్షే క్షత్రియం, ద్వాదశే వర్షే వైశ్యయం" ఇది పద్ధతి. ఎవరికి ఈ వయస్సులో ఉపనయనం జరుగదో అతడు పతితుడు అనబడతాడు.

దీనినిబట్టి స్పష్టమయేది ఏమిటి? ఎవరైతే తరుణంలో మంచి సంస్కారవంతుడు, గుణవంతుడు కావాలనుకుంటారో వారు తమ సంతానానికి ఉపనయనం చాలా త్వరగా చేయాలి. అందుకనే మనువు ఉపనయనమునకు సమయము (వయస్సు) గృహ్యసూత్రములు చెప్పినదానికంటే ముందే నిశ్చయించాడు. మనుస్మృతిలో (2-37) వ్రాశారు.

**బ్రహ్మవర్చస కామస్య కార్యం విప్రస్య పంచమే ।**
**రాజ్ఞో బలార్థివ: షష్ఠే వైశ్య దేహార్థినో...ష్టమే ॥**

దయానందుడు మనుస్మృతిపై ఉద్ధరణను ఇచ్చి వ్రాస్తాడు త్వరగా చదువు, బలము, వ్యవహారము అబ్బాలనుకునేవారు బాలుడు కూడ చదువులు చురుకుగా ఉండాలంటే బ్రాహ్మణ బాలునికి జన్మ నుండి 5వ సంవత్సరములోను, క్షత్రియ బాలునికి పుట్టుక నుండి 6వ సంవత్సరములోను, వైశ్య బాలునికి పుట్టుక నుండి 8వ సంవత్సరములోను యజ్ఞోపవీతము ధరింపజేయాలి.

**2. ఉపనయనం తరువాత బాలుడు ద్విజుడు అనబడతాడు :**

'ద్విజ'కు అర్థము రెండవ జన్మ. తల్లిదండ్రుల వల్ల మొదటి పుట్టుక కలుగుతుంది. కాని పుట్టిన తరువాత బాలుడు సంస్కృతి అనే బట్టలోపడి నూతన మానవుడయే దారిన పడినపుడు అతనికి రెండవ జన్మ కలిగిందని అంటారు.

మనుస్మృతి చెప్పింది - "జన్మనా జాయతే శూద్ర: సంస్కారాత్ ద్విజ ఉచ్యతే" - పుట్టినపుడు అందరూ శూద్రులే. సంస్కారాల వలననే మానవుడు ద్విజుడు అవుతాడు. సంస్కారాలు చేయకుండా ఎవడూ మానవుడు కాజాలడు. మనం చూస్తుంటాము గదా ఆయుర్వేదంలో సంకియలాంటి విషపదార్థాన్ని అనేక మార్పులు చేసి అమృతతుల్యంగా

మారుస్తారు. అడవిలోని భయంకర సింహాన్ని అనేక మార్పులు చేసి, మచ్చిక చేసుకుని మేకతో పాటు నీళ్లు త్రాగేదానిగా చేస్తారు. ఉపనయన సంస్కార ఉద్దేశ్యము ఇప్పటివరకు తల్లిదండ్రులు అనేక సంస్కారాల ద్వారా బాలునికి నూతన జీవితాన్నివ్వ ప్రయత్నించుచుతున్నారు. ఇపుడు అతనిని ఆచార్యుని దగ్గరకు తీసుకెళ్లి, ఆచార్యుని ద్వారా ఒక కొత్త జీవితపు మూసలో పోతపోయించాలనుకుంటున్నారు. బాలుని స్వభావాన్ని బట్టి అతని జీవితానికి నూతన మార్గమును చూపెట్టాలి.

**మమ వ్రతేతే హృదయం దధామి మమ చిత్తం అనుచిత్తంతే అస్తు ।**
**మమ వాచం ఏకమనాజిషస్వ బృహస్పతిష్ట్వా నియునక్తుమహ్యామ్ ॥**

సంస్కృతంలో శిష్యునికి ఒక మిక్కిలి సార్థకమైన శబ్దాన్ని వాడతారు 'అంతేవాసి' అని. అంతేవాసికి అర్థము గురువు హృదయంలో నివసించినవాడు. ఉపనయన సంస్కారం చేస్తూ గురువు శిష్యుని తన హృదయంలోనికి ఎలా తీసుకెళతాడో సూచించడానికి అధర్వణ వేదంలో ఒక మంత్రముంది. అది ఉపనయనము, వేదారంభ సంస్కారానికి రెండింటికి వర్తిస్తుంది.

**యజ్ఞోపవీతము – మహత్వము :**

యజ్ఞోపవీతములో మూడు పోగులుంటవి. అవి వరుసగా మూడు ఋణాలకు సూచకములు. 1. ఋషి ఋణము, 2. పితృ ఋణము, 3. దేవ ఋణము. మొదటి ఋణము బ్రహ్మచర్యాన్ని పాటిస్తూ, వేదవిద్యలు చదవడం వలన, రెండవ ఋణము ధర్మబద్ధంగా గృహస్థాశ్రమంలో చేరి, సంతానం కనడంచేత, మూడవ ఋణము గృహస్థాశ్రమాన్ని విడిచి దేశ సేవ కొరకు తనను సిద్ధం చేసుకోవడం వలన తీరుతవి. ఇందువలన ఈ మూడు ఋణాలు బ్రహ్మచర్యము, గృహస్థము, వానప్రస్థము మూడు ఆశ్రమాలకు సూచకములు. ఈ కారణంగానే మానవుడు ఈ మూడు ఋణాల నుండి ఎపుడు ముక్తుడవుతాడో, ఈ మూడు ఆశ్రమాలను దాటిపోతాడో అపుడే సూత్రాన్ని శాస్త్రానుసారంగా యజ్ఞాగ్నిలో పడవేస్తాడు. మరల దానిని ధరించడు. సన్యాస ఆశ్రమంలో ప్రవేశిస్తాడు. మానవుడు ఋణ ముక్తుడు కావలసిన మూడు ఋణాలు.

ఎ. **ఋషి ఋణము :** సంఘంలో ఋషులు జ్ఞానము, విజ్ఞానము పొంది ఆ జ్ఞానాన్ని మనకందించారు. వారు ఆ జ్ఞానాన్ని మనకందించకపోతే మనము పరమ మూర్ఖులుగా

అయేవారము. ఎలా వారు జ్ఞానాన్ని పొంది ఆ జ్ఞానాన్ని మనదాకా చేర్చారో అలాగే మనము కూడ ఆ జ్ఞానాన్ని పొంది సంఘంలో ముందు ముందు జ్ఞానగంగ ప్రవహించే ఏర్పాట్లు చేయాలి. ఈ విషయాన్ని యజ్ఞోపవీతంలో ఒక పోగు మనకు జ్ఞాపకం చేస్తుంది. మనము జ్ఞానాన్ని పొందేటపుడు ఋషుల ద్వారా మనపై మోపబడిన ఋణాన్ని జ్ఞాపకం చేసుకుంటూ ఉంటాము. ఈ పని బ్రహ్మచర్యాశ్రమంలో జరుగుతుంది. ఇందువలన బ్రహ్మచర్యాశ్రమము ఋషి ఋణాన్ని తీరుస్తున్నామని జ్ఞాపకం చేస్తూ ఉంటుంది.

బి. **పితృ ఋణము** : మన తల్లిదండ్రులు బ్రహ్మచర్యాశ్రమాన్ని పూర్తిచేసి గృహస్థాశ్రమంలో ప్రవేశించారు. మనల్ని కన్నారు. వారు గృహస్థాశ్రమంలో ప్రవేశించకపోతే మనం ఎలా పుట్టేవారము? ఇదే విధంగా మనం బ్రహ్మచర్యాశ్రమం పూర్తిచేసి, యౌవనంలో గృహస్థాశ్రమంలో చేరి సంఘానికి ఉత్తమ సంతానాన్ని ఇవ్వాలి. ఈ విధంగా సంఘానికి తండ్రి నుండి కొడుకు, కొడుకు నుండి మనుమడు వంశము నడుస్తూ ఉంటుంది. మనం బ్రహ్మచర్యం పూర్తిచేసి, గృహస్థాశ్రమంలో చేరేటపుడు తండ్రి ఋణాన్ని జ్ఞాపకం చేసుకుంటూ ఉంటాము. ఈ పని గృహస్థాశ్రమంలోనే కలుగుతుంది. ఇందువలన యజ్ఞోపవీతంలో రెండవ పోగు గృహస్థాశ్రమంలో చేరి తల్లిదండ్రుల ఋణము నుండి విముక్తులము అవుతున్నాము అని జ్ఞాపకం కలుగుతూ ఉంటుంది.

సి. **దేవ ఋణము** : ఆశ్రమ జీవితము యొక్క ముఖ్య ఉద్దేశ్యము సకామం నుండి నిష్కామం వైపు ముందుకెళ్లటమే. మనం ప్రపంచంలోని పనిపాటల్లో మునిగిపోయి, వాటి మోహంలో చిక్కుకుపోతాము. చివరకు ఈ మాయ మోహం నుండి బయటపడాలి. మనదేశం యొక్క సమాజం యొక్క పెద్దలు జీవితంలో ప్రవేశించి దాని బంధనాలను త్రెంచి, దానిలోనుండి బయటపడి స్వతంత్రం కావడానికి ప్రయత్నించారు. వారు గృహస్థులై గృహస్థాన్ని వదిలారు. వానప్రస్థంలో అడుగిడారు. ఈ విధంగానే గృహస్థాశ్రమాన్ని విడిచి సమాజానికి, దేశానికి సేవ చేయడానికి వానప్రస్థాశ్రమంలో చేరతారు. గృహస్థాశ్రమంలోనే చిక్కుకుని ఉండకూడదు. ఈ విషయాన్ని జ్ఞాపకంచేయటానికే యజ్ఞోపవీతంలోని మూడవ పోగు సంఘంలోని దివ్యపురుషుల ద్వారా మనపై ఉన్న ఋణం వైపు గుర్తుచేస్తూ ఉంటుంది.

**బాలికలకు యజ్ఞోపవీత సంస్కారమునకు అర్హత కలదు :**

ఈనాటి బాలికలకు యజ్ఞోపవీత అధికారం ఉన్నదా? లేదా? అనే విషయానికి ఏ ప్రాముఖ్యము లేదు. ఎందుకంటే ఈనాడు కన్యలకు చదువుకోవడానికి ఏ ఆటంకం లేదు. బాలబాలికలకు సమాన అధికారాన్ని భారత రాజ్యాంగము ప్రసాదించింది. అయినా ఉపనయన సంస్కార విషయం చారిత్రక దృష్టితో ఆలోచించవలసిన అవసరము. వైదిక సంస్కృతిలో నాటి నుండి నేటి వరకు ఏ దృష్టికోణంలో పని జరిగింది? ఈ విషయంపై ఆలోచించడం ప్రకరణ సమ్మతమే. ఎందుకంటే నేడు కూడ అనేకమంది వేదముల పేరిట పనికిరాని మాటలను చెపుతున్నారు, వింటున్నారు. ఉపనయనమునకు అర్థము - చదువుకొనుటకు అధికారం కలిగివుండటం. ఇందువలన ఈ విషయంలో మేము వ్రాసేదానిలో రెండు విషయాలు స్పష్టం చేస్తాము. ఒక విషయం వైదిక సంస్కృతిలో కన్యలకు యజ్ఞోపవీతం ధరించే అధికారం బాలురతో సమానంగా ఉంది. రెండవ విషయం వేద కాలంలో స్త్రీలు వేదశాస్త్రాలు చదివేవారు. ఈ విషయంలో వారికెలాంటి ఆటంకము లేదు. ఈ రంగంలో బాలబాలికలు సమాన పోకడ కలిగిఉన్నారు.

ఎ. **కన్యలకు యజ్ఞోపవీత అధికారము కలదు :** గోభిలీయ గృహ్యసూత్రంలో వ్రాశారు - కన్యకు బట్టలు, యజ్ఞోపవీతం ధరింపజేసి భర్త దగ్గరకు తీసుకురావాలి. కన్య యజ్ఞోపవీతం ధరించి ఉండాలనేది ఈ మంత్రం వలన స్పష్టమవుతుంది. కన్యలకు ఉపనయన సంస్కారం జరిగేది. పూర్వకాలంలో స్త్రీలకు మౌంజి బంధనంతో ఉపనయన సంస్కారం జరిగేది. వారు వేదశాస్త్రాలు కూడ చదివేవారు.

హీరతసంహితలో స్త్రీలను బ్రహ్మవాదినులు, సద్యోవధువులు అను రెండు రకాలుగా విభజించారు. పరాశరసంహితకు భాష్యకారుడు, పండితశ్రేష్ఠుడు మధ్వాచార్యుడు. దాని టీకలో వ్రాస్తాడు. రెండు రకాల స్త్రీలుండేవారు. ఒకరు బ్రహ్మవాదినులు. వారికి ఉపనయనము జరిగేది. వారు అగ్నిహోత్రం చేసేవారు. వేదాలు చదివేవారు, తమ కుటుంబంతోనే భిక్షావృత్తితో జీవించేవారు. రెండవ రకం వారికి వెంటనే వివాహం చేసేవారు. ఈ వివాహం చేసుకునే స్త్రీలకు కూడా ఏదోరకంగా ఉపనయన సంస్కారం చేసి, వివాహం చేసేవారు. దీనినిబట్టి మధ్వాచార్యులు కూడా స్త్రీల ఉపనయన సంస్కారాన్ని బలపర్చేవారని స్పష్టమవుతుంది.

కాదంబరీ మహాకావ్యంలో మహాకవి బాణభట్టుడు 7వ శతాబ్దపు చారిత్రక మహారాజు హర్షవర్ధనుని కొలువులో రత్నంలాగా ప్రకాశించేవాడు. అతను మహాశ్వేతను వర్ణిస్తూ వ్రాశాడు – 'బ్రహ్మసూత్రుణ పవిత్రీకృతకాయాం' – అనగా ఆమె శరీరం బ్రహ్మసూత్రం ధరించడంచేత పవిత్రమైనది. బ్రహ్మసూత్రము యజ్ఞోపవీతానికి మరొక పేరు. బ్రహ్మసూత్రానికర్థము సూత్రగ్రంథాలలో, సంస్కృత కోశములలో యజ్ఞోపవీతమని చెప్పబడింది. దీనిని బ్రహ్మసూత్రము, యజ్ఞ సూత్రము, యజ్ఞోపవీతము అని అనేక పేర్లతో పిలుస్తారు.

**కన్యలకు వేదము చదివే అధికారం కలదు :** వైదిక సంస్కృతిలో కన్యలకు బాలురతో సమానంగా వేదాధ్యయన అధికారమున్నది. ఈ విషయం అనేక వైదిక ఉటంకములతో బలం చేకూరింది. దయానందుడు సత్యార్థప్రకాశంలో కన్యల వేదాధ్యయాన్ని బలపరుస్తూ అధర్వణ వేదాన్ని ఉదాహరిస్తూ వ్రాశారు. "బ్రహ్మచర్యేణ కన్యా యువానం విందతే పతిమ్". ఈ మంత్రానికర్థము కన్య బ్రహ్మచారిణిగా నుండి యువకుడైన భర్తను పొందగలదు. బ్రహ్మచారిణి కావాలంటే ఉపనయనపూర్వక బ్రహ్మచర్య జీవితం గడుపుతూ గురువుగారి ఆశ్రమంలో ఉండాలి. బ్రహ్మచారిణిగా ఉన్న కన్యకు ఉపనయన సంస్కారం తప్పనిసరిగా జరిగితీరాలి. ఆమె యజ్ఞోపవీతము తప్పక ధరించి ఉండవలెను. ఆ తరువాత ఆయన శ్రౌత సూత్రాలలో వ్రాస్తారు. 'ఇమం మంత్రం పత్నీ పఠేత్' – ఈ మంత్రాన్ని భార్య చదవాలి అని వ్రాసి ఉంది. భార్య మంత్రము ఎప్పుడు చదువగలుగుతుంది? ఆమెకు వేదాధ్యయన అధికారము ఉన్నపుడే గదా! అలా కాకపోతే ఆమె వేదమంత్రం ఎలా చదువగలుగుతుంది?

యజుర్వేదంలో స్త్రీని 'స్తోమపుష్ఠా' అన్నారు. దీని అర్థము ఆమె వేదమంత్రముల విషయంలో అనేక ప్రశ్నల ద్వారా తెలుసుకోగోరుతుంది. ప్రాచీన చరిత్రలో సులభ అనే పేరు చాలా ప్రసిద్ధి చెందింది. సులభ సంకల్పము తనను శాస్త్రార్థంలో ఓడించినవానినే వివాహమాడుతుంది. సులభ యొక్క ఈ నిశ్చయము ఆమె అగాధ పాండిత్యాన్ని తెలుపుతుంది గదా! మండనమిశ్రున భార్య విద్యాధరి శంకరాచార్యుని లాంటి పండితుని ఎదుట మధ్యస్థురాలు (తీర్పరి)గా ఉండటం, మరల ఆయనతో శాస్త్రార్థము చేయుట స్త్రీ వేదాధ్యయన అధికారాన్ని ఏనాడూ కోల్పోలేదని స్పష్టమవుతుంది.

బృహదారణ్యకోపనిషత్తులో (2.1) గార్గి కథ వస్తుంది. అక్కడ వ్రాసి ఉంది - జనకమహారాజు ఆ కాలంలో అందరికంటె గొప్ప విద్వాంసుడు ఎవరో తెలుసు కోవడానికి ఒక పెద్ద సభను ఏర్పాటుచేశాడు. బంగారంతో పొదగబడిన కొమ్ములు గల వేయి ఆవులను ఒకచోట నిలిపి చాటింపు వేశాడు - 'అందంకంటె మించిన గొప్ప విద్వాంసుడుఈ ఆవులను తోలుకుపోవచ్చును' అని. యజ్ఞవల్క్యుడు తన ఒక శిష్యుని పిలిచి ఆవులను తోలుకెళ్లవలసిందిగా ఆజ్ఞాపించాడు. ఆ సమయమున గార్గి నిండుసభలో నిలబడి యజ్ఞవల్క్యుని పాండిత్యాన్ని పరీక్షించటానికి అనేక ప్రశ్నలు వేసింది. గార్గి ఈ వ్యవహారం వలన ఆమె పాండిత్యము సాహసమైన ప్రమాణంగా కాక ఆనాడు వేదములో అగాధ పాండిత్యమున్న స్త్రీలు ఉన్నారనడానికి నిదర్శనము. ఇదేగాక వేదము తెలిసనవారు ఎరుగుదురు - వేద మంత్రాల అర్థం స్పష్టంగా చెప్పేవారిని ఋషులు అంటారు. 'ఋషయే మంత్రద్రష్టార:'. వేరు వేరు మంత్రాలకు అర్థమును వేరు వేరు ఋషులు కనుగొన్నారు. అనేక వేద మంత్రములకు అర్థం చేప్పిన స్త్రీ ఋక్షికలు కూడ ఉన్నారు. ఉదాహరణకు లోపాముద్ర, శ్రద్ధ, సరమా, రోమశా, విశ్వవారా, అపాలా, యమీఘోషా మొదలగు స్త్రీ ఋక్షికలు వేదమంత్రాలలో దాగున్న గూఢమైన రహస్యాన్ని సాక్షాత్కరింప చేసుకొన్నవారున్నారు.

నేటి కాలంలో కన్యలు చదువులలో, ఇతర అనేక రంగాలలోను బాలురకంటే ముందుకుపోతూ కనబడుతున్నారు. ఇదంతా వ్రాయవలసిన అవసరం లేదు. అయినప్పటికి ప్రాచీన వైదికధర్మాన్ని వాస్తవంగా తెలుసుకోవటానికి ఇదంతా మేము పైన వ్రాసింది అవసరమైంది. దీనివలన స్త్రీల విద్య విషయంలో వైదిక సంస్కృతి దృష్టికోణము ఏమిటో స్పష్టమవుతుంది.

**ఉపనయన సంస్కార సమయంలో కొన్ని మధ్యంతర విధులు :**

**ఎ. ఉపనయనానికి ముందు భోజనం :** 'సంస్కారవిధి'లో వ్రాశారు - ఏరోజున బాలునికి యజ్ఞోపవీతం వేయవలెనో దానికి 3 రోజులు గాని ఒక రోజు గాని ముందు బ్రాహ్మణ బాలుడు ఒకసారి గాని అనేకసార్లు గాని కేవలం పాలు త్రాగాలి. క్షత్రియ బాలుడు యవల గంజి త్రాగాలి. వైశ్య బాలుడు కేవలం శ్రీఖండము తినాలి. దీని కొరకు

శతపథ బ్రాహ్మణములో చెప్పబడింది. "పయోవ్రతో బ్రాహ్మణ: యవాగూవ్రతో రాజన్య: ఆమిక్షావ్రతో వైశ్య:" ఆకలి అయినపుడల్లా బాలురు మూడు వర్ణాలవారికి నిర్దేశించబడిన మూడు పదార్థాలను తీసుకోవచ్చును. వేరు పదార్థములను స్వీకరించరాదు.

బ్రాహ్మణ బాలుని ఆవుపాలు త్రాగమనడంలోని ఉద్దేశ్యము అతడు సాత్విక భావాలుగలవాడు కావాలని. యవలు అంటే గోధుమలు. ఆహారంలో యవలు బలానికి సూచన. ఇందువలననే గుఱ్ఱములకు యవలు తినిపిస్తారు. హోమియోపతిలో యవలు బలానికి గాను వాడతారు. అందుకనే క్షత్రియ బాలుని యవల జావను త్రాగమన్నారు. వైశ్యునికి శ్రీఖండము తినమని చెప్పబడింది. ఎందుకంటే శ్రీఖండము శ్రీ లక్ష్మీ ఖండమునకు సూచన. ఈ మూడు తినుబండారములను మూడు దినములు గాని ఒక దినము గాని ఇవ్వడం, వాటిద్వారా చేకూరే బలానికి నిదర్శనము.

**బి. ఉపనయన కాలంలో బాలుడు గురువుతో నన్ను బ్రహ్మచారిని చేయండి అని చెప్పడం :** బ్రహ్మచర్యము, గురుకులము, ఆచార్యుడు మొదలయిన శబ్దాలకు తాత్విక అర్థాలను వేదారంభ సంస్కారంలో చెపుతారు. కాని ఇక్కడ ఒక విషయం చెప్పాలి - బాలుడు ఆచార్యుని దగ్గరకొచ్చినపుడు తాను బ్రహ్మచర్యపూర్వకంగా జీవితం గడపడం. ఉపనయన సంస్కార ఉద్దేశ్యం ఇదే. బాలుడు ఆచార్యుని దగ్గరకొచ్చి 'నాకు బ్రహ్మచర్య దీక్షను ఇవ్వండి. నేను ఒక మంచి మానవున్ని కావాలి' అని ప్రార్థిస్తాడు. చరిత్ర నిర్మాణం చేసుకుంటూ లేక చరిత్రను బయట నుండి ఆరోపిస్తూ లేక లోపల నుండి ఉబికి రావచ్చును. బయటి నుండి తోయడం ఆరోపణము. లోపల నుండి రావడం చరిత్రకు ఆరోహణము. బలవంతంగా రుద్దితే అది జీవితంలో భాగం కాజాలదు. అది లోపల నుండి ఉబికనపుడు అది జీవితంలో భాగమవుతుంది. ఇందువలననే బాలుడు ఉపనయన కాలంలో గురువు గారి దగ్గరకొచ్చి అంటాడు 'బ్రహ్మచర్యమాగామ్ బ్రహ్మచర్యసాని' - నేను బ్రహ్మచర్య జీవితంలో దీక్ష తీసుకోవటానికి, బ్రహ్మచారి కావటానికి ఓ భగవానుడా నేను మీ దగ్గరకొచ్చాను. నేను బ్రహ్మచారి కావటానికి ఆశీర్వదించండి. ఉపనయనం యొక్క ఉద్దేశ్యము బాలుని హృదయంలో అతని లోపల నుండి బ్రహ్మచారి కావాలనే భావన కలగాలి. అతనికిదివరకెన్నో సంస్కారాలు చేశారు. అతనిపుడు తెలుసుకోవాల్సింది - నేను ఇపుడు ఏదో కావాలి, అందుకనే అమ్మనాన్నలు నన్ను గురువుగారి దగ్గరకు

తీసుకువచ్చారు. ఆచార్యుని ఆశ్రమం చూచి పారిపోవడానికి కాదు. బాలుడు తనను బ్రహ్మచారిని చేయమని అడిగినపుడు, ఆచార్యుడు అతనికి ఉపవస్త్రాన్ని ధరింపజేస్తాడు. ఇంకా ఇలా చెపుతాడు – దేవతల గురువు బృహస్పతి దేవేంద్రునకు జ్ఞానరూప అమృతవస్త్రాన్ని ధరింపజేశాడు. అదేవిధంగా నేను నీకు ఉపవస్త్రాన్ని ధరింపజేస్తున్నాను. ఇది జ్ఞానరూప అమృత వస్త్రము. ఈ వస్త్రాలు జ్ఞానానికి, బ్రహ్మచర్య జీవితానికి గుర్తులు. దీనివలన నీకు దీర్ఘాయువు కలుగుతుంది. బలం వస్తుంది. తేజస్సు కలుగుతుంది. ఈ వస్త్రాలను కేవలం వస్త్రం మాత్రమే అనుకోగూడదు. ఎలా ఈ వస్త్రాలు నిన్ను కప్పి వుంచుచున్నవో అలాగే బ్రహ్మచర్య దీక్షారూప వస్త్రము నిన్ను కప్పివుంచి రక్షిస్తుంది.

## 11. వేదారంభము

**నూనె రాసుకోవద్దు, నేయి, కారం మసాలాలు తినకు :**

వెంట్రుకల అలంకరణకు, శరీరాలంకరణకు నూనె వద్దంటున్నారు. దీనికర్థము బాలుడు మురికిగా ఉండాలని కాదు. శుభ్రంగా ఉండమని బ్రహ్మచారిని ప్రోత్సహిస్తాము. కాని సింగారించుకోవడం బ్రహ్మచర్యానికి ప్రమాదము. శృంగారము ఇతరుల్ని ఆకర్షించటానికి చేస్తారు. బ్రహ్మచారికి ఇతరులను ఆకర్షించే పని ఏముంది? ఇదిగాక మిక్కిలి పులుపు, చింతపండు లాంటివి, మిక్కిలి తీపి, కారము, మసాలా మొదలయినవి కూడా సేవించడం ఆరోగ్యానికి మంచిది కాదు. దానిని వద్దన్నారు. గురుకులంలో ఈ వస్తువులన్నీ నిషిద్ధమని తండ్రికి తెలుసు. కాబట్టి తన కుమారునికి వాటిని మనసారా విసర్జించమని చెబుతున్నాడు.

**ఆహార విహారాదులలో నియమంగా ఉండి విద్యోపార్జన చేయి :**

ఆహార విహారాన్ని కర్థము తినడం, త్రాగడం, ఆడటం, ఎగరటం, దూకడం. బ్రహ్మచారి గురుకులవాసంలో మూడు పనులు చేయాల్సి ఉంటుంది. 1. తినుట, త్రాగుట. 2, ఆడుట, దూకుట. 3. చదువుట, వ్రాయుట. ఇందులో తిని త్రాగే దానికి ఏ నిషేధము లేదు. కేవలం నియమబద్ధంగా తిని త్రాగాలి. వేళాపాళా లేకుండ, పరిమితి లేకుండ కాదు. ఇదేవిధంగా బాగా ఆడుకో, ఎగురు, దూకు. కాని ఎప్పుడూ అందులోనే ఉండకు. ఆడుకోవటానికి, దూకటానికి కూడ వేళ ఉంటుంది. మూడవది చదువుట,

వ్రాయుట. ఇదే బ్రహ్మచారి ముఖ్య కర్తవ్యము. తండ్రి అంటాడు – కుమారా! విద్యోపార్జన చేయి, అందులో ఏ లోపము రానీయకు.

**మంచివాడవుకమ్ము, మితంగా మాట్లాడు, నాగరికంగా ఉండు :**

ఈ మాటలకు విశేష వివరణ అవసరంలేదు. నాగరిక లక్షణాలు ఇవి. వ్యక్తి సచ్చరిత్రుడు కావాలి. అతని నడతను చూచి ప్రశంసించాలి. ఊరికే వాగకూడదు. అవసరమైనంతవరకే మాట్లాడు. అందరితో మర్యాదగా మాట్లాడు.

**మొలత్రాడు, కర్రను పట్టుకొనుట, భిక్షాటన, సంధ్య, యజ్ఞము, స్నానము, ఆచార్యుని యెడల గౌరవము, విద్యోపార్జన, జితేంద్రియత్వము మొదలయిన వాటిని ధర్మంగా భావించుట:**

ఈ ఒక్క వాక్యంలో తండ్రి ముగింపు చేస్తూ ముఖ్య విషయాలన్నింటిని మరల ఉపదేశ సారంగా చెప్పాడు.

తండ్రి ఈ దీర్ఘ ఉపదేశాన్ని అక్షరం అక్షరం తెలుసుకున్నాడని చెప్పలేము. కాని బాలుడు గురుకులవాసం గడిపేకొద్దీ ఆచార్యుడు తెలియజెపుతూ ఉంటాడు. బాలుడు ఆచరించవలసిన నియమాలను తండ్రి గురుకులంలో చేరే మొదటి రోజునే చెప్పాడు.

**వేదారంభ సంస్కారంలోని కొన్ని ముఖ్య విధులు :**

వేదారంభ సంస్కారంలో ముఖ్య విషయాలను తెలిపారు. ఈ సంస్కారంలో కొన్ని ముఖ్య విధులు కూడ ఉన్నవి. వాటిని విశదపరుస్తూ మేము ముందుకు వెళతాము. ఆ నియమాలు ఇవి : దండ ధారణ చేయుట, భిక్ష చేయుట, మొలత్రాడు, గోచిపాత ధరించుట.

ఎ. **దండము ధరించుట** : వేదారంభ సంస్కారంలో ఆచార్యుడు బ్రహ్మచారి చేతికి కర్రను ఇస్తాడు. దీనికి ప్రత్యక్ష ఉద్దేశ్యములు రెండు కావచ్చును. ఒకటి కర్ర ద్వారా తన రక్షణ చేసుకోవచ్చు. పూర్వకాలంలో ఆచార్యుల ఆశ్రమాలు అడవులలో ఉండేవి. గురుకులాలు కూడ అడవులలో ఉండేవి. వేదంలో చెప్పారు – కొండ లోయలలో నదుల సంగమము దగ్గర ఆశ్రమాలలో బుద్ధికుశలురైన బ్రహ్మజ్ఞానులు తయారవుతారు. పూర్వకాలపు విద్యా కేంద్రాలు ఈకాలంలో లాగ పట్టణాల రాజమార్గాలపైన పెద్ద పెద్ద బజార్లలో ఉండేవికావు. రోడ్లపైన, వీధులలో విద్యాలయాల వాతావరణం ఉంటే, విద్యార్థి ధ్యాస చదవడం, వ్రాయడంలో కేంద్రాకరించబడక బహిర్ముఖము అవుతుంది. ఆకాలంలో

జనసంఖ్య కొద్దిగా ఉండేది. అడవులు ఎక్కువగా ఉండేవి. తరచుగా వానప్రస్థులే విద్యాకేంద్రాలు నడిపేవారు. అడవులలో ఉండటం వలన క్రూరమృగాల వలన ఆత్మ రక్షణ కొరకు కర్ర ఉండవలసిన అవసరం ఉంది. ఈ విధంగా తన రక్షణ, ఇతరుల రక్షణ కూడ జరిగేది. ఆత్మ రక్షణే కాక ఇతరుల రక్షణ చేయడం కూడ దండధారణ ఉద్దేశ్యము. తన రక్షణ, ఇతరుల రక్షణకు ఎపుడూ కర్ర చేతిలో ఉండవలసినదే. పూర్వకాలంలోలాగ నేడు కూడ అది అవసరమే. ఈ విధంగా వేదారంభ సంస్కారంలో దండధారణ చేయించడం ఒక భాగమైపోయింది.

బి. **భిక్ష చేయుట :** వేదారంభ సంస్కారంలో బ్రహ్మచారి భిక్ష చేయడం కూడ ఒక అవసరమైన భాగము. బ్రహ్మచారి భిక్షతో దొరకిన దానిని ఆచార్యుని పాదముల ముందు పెడతాడు. బాలుడు ఏ ఇంటివాడైనా సరే, అనగా ధనికుడైనా, దరిద్రుడైనా, రాజైనా, బికారి అయినా ప్రతి బ్రహ్మచారి భిక్ష చేయుట అవసరము. భిక్ష చేయడంలో ప్రతి బ్రహ్మచారి తన అహంకారాన్ని విసరిపారేసేవాడు. శ్రీకృష్ణుడు రాజవంశీకుడు. కుచేలుడు మామూలు బ్రాహ్మణుడు. కాని వారిద్దరు తమ అహంకారాన్ని వదలుకొని గురు చరణముల దగ్గర కూర్చున్నారు. భిక్ష చేసే బాలుడు ఎంత గొప్ప రాజకుటుంబీకుడైన, కోటీశ్వరుల కుమారుడైనా తనను సమాజంలో ప్రతి దశలోని బాలుని స్థాయికి తీసుకువచ్చేవాడు. ఏ సమాజంలో చిన్నతనం నుండి మనమందరం సమానమన చెప్పబడుతుందో, పుట్టుకతో ఎవడూ పెద్దవాడు, చిన్నవాడు కాదు, ప్రతివాని చేతికి భిక్షాపాత్ర ఇవ్వబడుతుందో ఆ సమాజంలో సోషలిజం కాక మరేది వస్తుంది? భిక్షకు అర్థము బిచ్చమెత్తడం కాదు. రాజకుమారుడు భిక్షాటన ఏమి చేస్తాడు? భిక్షకు అర్థం సమాజంలో నెలకొన్న ఉచ్చ నీచ భేదభావానికి స్వస్తి చెప్పడం. కమ్యూనిజంలో ఎంత ప్రయత్నం చేసినా మానవులలో భేదం ఉంటూనే ఉంటుంది. అయినప్పటిక వైదిక సంస్కృతిలో చిన్నతనం నుండే ప్రతి బాలుడు రెండవవానితో సమానమనే భావం అక్షరాభ్యాసం చేసేటప్పటి నుండే మెదడులో కలిగించబడుతుంది.

ఇదిగాక భిక్షావృత్తి వలన చదువుకోవడానికి రెండు లాభాలున్నవి. భిక్షావృత్తితో చదివేవాడు చదువుతూనే ఉంటాడు. తన సమయాన్ని వృధాగా పోనివ్వడు. అతనికి మొదటినుండే తెలుసు, తన జీవితంలో భౌతిక సంపద దృష్ట్యా లేమితో ఆరంభమైనదని. ఎవడు లేమితో జీవితం ఆరంభిస్తాడో వాడు జీవితంలో ముందుకు సాగిపోతాడు. శూన్యము (సున్న) కంటే దిగువకు ఎవడు పోగలడు? భిక్షావృత్తి వలన రెండవ లాభము, పూర్వకాలంలో

గురుకులంలో విద్య ఉచితంగా చెప్పబడేది. గురు శిష్యులు ఇద్దరకూ భిక్షావృత్తితోనే జీవితం గడిచేది. వారికి ఇంతకంటె అవసరమైనది మరొకటి ఏమీ లేకుండెను.

ఈ రివాజు కేవలము కల్పితమైనది. వాస్తవంగా సమాజంలో ఇలాంటి పద్ధతి ఏదీ లేదు అని తలచడం తప్పుడు నమ్మకము. దక్షిణ భారతదేశంలో నేడు కూడ అనేకమంది విద్యార్థులు భిక్షావృత్తితో తమ ఉన్నత విద్యను పొందుతున్నారు. దీనిని 'మధుకరీ' వృత్తి అంటారు. విద్యార్థి గృహస్థుల ఎదుట 'భవతి భిక్షాందేహి' అని పిలుస్తాడు. గృహిణి అతని జోలెలో అతనికి సరిపడ అన్నాన్ని పెడుతుంది. బర్మాలో కూడ విద్యార్థులు భిక్షావృత్తితో తమ చదువు పూర్తిచేస్తారు. బర్మాలోనయితే ధనిక కుటుంబాల బాలురకు అది అవసరమే. ఎందుకంటే తమ బాలుని ప్రతి కుటుంబానికి, భిక్షా కేంద్రానికి కొంతసేపు చదువుకోవడానికి పంపుతారు.

**సి. మొలత్రాడు, గోచిపాత :** మొలత్రాడు విషయంలో మేము ఈ సంస్కారం విధి భాగంలో వ్యాఖ్యానిస్తాము. కాపీనం (గోచిపాత) గురించి 'కౌపీనవంత: ఖలు భాగ్యవంత: అనే నానుడి ప్రసిద్ధి చెందింది. కౌపీనమునకు అర్థము లంగోట. లంగోట ఉద్దేశ్యము బ్రహ్మచారికి వీర్య రక్షణలో సహాయపడుతుంది. ఏ వ్యక్తి ఈ ఆచారాన్ని పాటిస్తాడో అతనిని లంగోట ధనవంతుడు అంటారు. ఏ వ్యక్తియైన కఠిన శ్రమ చేయాలంటే లంగోట బిగించి రంగంలోకి దిగుతాడు. ఈ అన్ని యుక్తులు (ఉపాయములు) లో మానవ సమాజంలో సదాచారము, వీర్య రక్షణ అనుభవం దాగివుంది. కౌపీనం ధరించడం వలన వ్యక్తి చురుకుగా ఉంటాడు. విషయవాసనలవైపు అతని ధ్యాస పోదు. మామూలుగానయితే కౌపీనం ధరించడం సాధారణ విషయం కావాల్సింది. కాని అలా కాదు. దీనిని వేదారంభ సంస్కారంలో ఒక భాగంగా చేశారు. దీనిని 'యువాసువాసా పరివీత ఆగాత్' అనే వేదమంత్రంతో జోడించారు. దీని అభిప్రాయము లంగోట ధరించడం ఇతర వస్త్రాలు ధరించడంతో సమానం కాదు. బ్రహ్మచర్యము, వీర్య రక్షణలో సహాయకారి కావటంఅది ఈ సంస్కారంలో విడదీయరాని భాగమైంది.

## 12. సమావర్తనము

వేదారంభ సంస్కారం 8 సంవత్సరముల వయసులో చేసినట్లయితే సమావర్తన సంస్కారం 14 సంవత్సరాల తరువాత చేయాలి. వేదారంభము చేస్తూ బాలుడు చదువు మొదలుపెడతాడు. సమావర్తన సమయానికి చదువు పూర్తి అవుతుంది. బాలుడు పుట్టిన

తరువాత 8 సంవత్సరముల వరకు 11 సంస్కారాలు జరుగుతవి. దీని తరువాత 14 సంవత్సరముల ఎడము అవుతుంది. అపుడుగాని సమావర్తన సంస్కార సమయం రాదు. సమావర్తనం తరువాత వివాహ పరిణామంగా గృహస్థ, వానప్రస్థ, సన్యాసము వీటితో సమయము ఇంకా ఎడము అవుతుంది. బాలుని మీద సంస్కారముల ప్రభావం పడే కాలం అతని మెదడు సంస్కారాలను గ్రహించటానికి సిద్ధంగా ఉన్నప్పుడే. అది 8 సంవత్సరములకు ముందున్న కాలం. ఇందువలన ఈ సమయాన్ని ఉపయోగించుకొని సంస్కారం తరువాత సంస్కారం చెప్తారు. దీని తరువాత బాలుని మెదడు పరిపక్వం అవుతుంది. అపుడు సంస్కారాల ప్రభావం పడే సమయం కాదు. 8 సంవత్సరముల తరువాత జరిగే సంస్కారాల బాధ్యత ఆచార్యుని మీద వదిలిపెట్టబడింది. యౌవనంలో సంస్కారాన్ని గ్రహించటానికి పరిస్థితుల ప్రభావం ఎక్కువగా ఉంటుంది. ఈ వయస్సులో వాడు ఎలాంటి సహవాసంలో ఉంటాడో, ఎలాంటి గురువు, సంఘ వ్యక్తుల సాంగత్యం ఉంటుందో వారి నుండి అతడు అలాంటి సంస్కారాలనే గ్రహిస్తాడు. గురుకులవాసంలో ఆచార్యుని విద్య దీక్షలో మెలిగిన విద్యార్థుల సరసన ఉంటాడు. అతని చరిత్ర నిర్మాణమయ్యే వాతావరణంలో పెరుగుతాడు. వాడు ఒక ఉత్తమ నాగరికుడై సమాజంలో భాగస్థుడవుతాడు.

విద్యాసంస్థలో యువకుని చరిత్ర ఎలా తయారవాలో, ఏవిధంగా సంఘంలో వుండాలో, వ్యవహరించాలో దాని ఒక రూపురేఖ తైత్తిరీయోపనిషత్తులో శిక్షాధ్యాయవల్లీలో చూడవచ్చును. ఎలా గురుకులంలో చేరేటపుడు తండ్రి కుమారునకు సంస్థలో ఏకాత్మభావం కలగటానికి ఉపదేశం చేశాడో అలాగే సంస్థలో విద్యాకాలం పూర్తిచేసిన తరువాత బాలుడు సమాజంలో ఎలా మెలగాలో, సంస్థలో నేర్చుకొన్న ఆచార వ్యవహారాలను ఎలా ఆచరణలో పెట్టాలో ఆచార్యుడు ఉపదేశిస్తాడు. వేదారంభ సంస్కారాన్ని లోతుగా తెలుసుకోవడానికి తండ్రి బాలునికి ఇచ్చిన ఉపదేశము ఎంత ముఖ్యమో, అలాగే సమావర్తన సంస్కారం లోతును (ప్రాముఖ్యము) తెలుసుకోవడానికి ఆచార్యుని ద్వారా శిష్యునికివ్వబడిన ఉపదేశము అంతే ముఖ్యమైనది.

**ఆచార్యుడు స్నాతకునికిచ్చిన ఉపదేశములు**

**సత్యం వద = సత్యమునే చెప్పుము :**

ఇపుడు నీవు ఆశ్రమం అనే చిన్న కుటుంబాన్ని వీడి సమాజమనే పెద్ద ప్రపంచంలోకి ప్రవేశింపబోవుచున్నావు. అక్కడ లోకులు నీతో ఉంటారు. ప్రపంచ వ్యవహారం గురుకులం

నియమాన్ని బట్టి నడవదు. నీవు గురుకులంలో ప్రతి విషయంలో నిజం చెప్పాలని ప్రతిజ్ఞ చేశావు. కాని ఇక్కడ అబద్ధం కూడ నడుస్తుంది. ప్రతి విషయంలో నిజం చెపితే నీవు చిక్కుల్లో పడిపోతావు. కాని జ్ఞాపకం ఉంచుకో జనులు అబద్ధాన్ని నిజమనుకున్నంత కాలము నడుస్తుంది. కల్తీ నాణెము, నిఖాల్సు (కల్తీ లేనిది) అనుకున్నంత వరకే నడుస్తుంది. అబద్ధము నడుస్తున్నట్లుగానే నీకు కనబడుతుంది. కాని లోతుకెళ్లి చూస్తే దాని ఆయువు కొద్దికాలమే. నిజానికి ఆయువు అంతులేనిది. ఎలా ఆశ్రమం లోపలనో అలాగే ఆశ్రమం బయట ప్రపంచంలో కూడ సత్యశోధన జరుగుతున్నది. అన్నిచోట్ల కచేరీలు, న్యాయస్థానాలు ఈ పనిలోనే లీనమై ఉన్నవి. అన్నిటి ఉద్దేశ్యము ఏదో విధంగా అబద్ధాల గుట్టలో దాగున్న నిజాన్ని వెలికితీయడమే. ఇందువలన ఈ ఆశ్రమంలో నేర్చుకున్న పాఠం ఏమిటంటే సత్యమే జయిస్తుందని. ఈ విషయాన్ని మరువకు. ఇది పరీక్షించబడినది. అనుభవసిద్ధమైన సిద్ధాంతము. దీనిని పట్టుకుని ఉండుము.

**ధర్మం చర :**

ఆచార్యుని రెండవ ఉపదేశము ధర్మాన్ని ఆచరించడం. వైదిక ధర్మంలో ధర్మానికి సంకుచిత అర్థం కాదు. మనుస్మృతి (2.2)లో వ్రాశారు. 'వేద: శృతి: స్మృతి: సదాచార: స్వస్యచ ప్రియమాత్మన: ఏతత్ చతుర్విధం ప్రాహు: సాక్షాత్ ధర్మస్య లక్షణం'. ధర్మం అంటే మతం కాదు. 'ధారణాత్ ధర్మమిత్యాహు:'. ఏ నియమాల వలన సమాజం ధరించబడి ఉందో, ఏ నియమాల ఆధారంగా సమాజం నిలిచి ఉందో అది ధర్మము. వేదములలో ఆ నియమముల ఆచారాల వర్ణన ఉంది. వాటిని పాటిస్తే సమాజం నిలిచి ఉంటుంది. వాటిని అతిక్రమిస్తే సమాజం చిందరవందర అవుతుంది. స్మృతిలో సమాజంలో మారే దశలను చూచి సమాజ వ్యవస్థను నిర్మాణం చేస్తారు. సమాజంలో సత్పురుషులు అపుడపుడు కొన్ని దశలను చూపెడతారు. ఈ సత్పురుషుల ఆచారాన్నే సదాచారము అంటారు. మనుష్యుని లోపల కూడ ఏది సరియైనదో, ఏది సరికాదో, ఏది తగునో, ఏది తగదో 'అంతర్వాణి స్వస్యచ క్రియామాత్మన:' ..... నిర్ణయించే శక్తి ఉంది. వీటన్నింటిని వైదిక పరిభాషలో ధర్మము అంటారు. మనువు అంటాడు 'ఆచార: పరమోధర్మ:'. సదాచారాన్ని సమాజంలో ఏవిధంగా వర్తింపజేయాలి, ఎలా వ్యవహరించాలి? చివరగా వ్యక్తి సమాజము, దేశమునకు మేలు చేసేదాన్ని ధర్మ మంటారు. ఈ దృష్టితో ఎల్లప్పుడు నీ జీవితంలో ధర్మాన్ని పాలించుము.

**సత్యాన్నప్రమదితవ్యం, ధర్మాన్నప్రమదితవ్యం :**

సత్యము, ధర్మముపై దృఢంగా ఉండమన్న విషయాన్ని మరల రెండవమారు చెబుతున్నాడు. ఇలా ఎందుకు చెబుతున్నాడంటే ఇదే అతనికి తాను గడపిన విద్య. సత్యము, ధర్మములను మరల చెప్పడం వాటి ప్రాముఖ్యాన్ని తెలుపుతుంది. శిష్యుడు ఆ రెంటిని మరచిపోకూడదని.

**దేవ పితృకార్యాభ్యాం నప్రమదితవ్యం :**

మనకంటే జ్ఞానంలో పెద్దవారిని దేవతలు అంటారు. వయసులో పెద్దవారిని పితురులు అంటారు. జ్ఞానంలో మిన్న అయిన వారు నీకు గురువులు కాక పోవచ్చును. కాని వారు చెప్పింది తిరస్కరించకు. అలాగే ఆయువులో పెద్దవారు నీ తల్లిదండ్రులు కాకపోవచ్చును. వారు చెప్పినదానిని జవదాటకు. వారు నీ ఆచార్యులు కారని, నీ తల్లిదండ్రులు కారని వారు చెప్పింది ఎందుకు వినాలి అనుకోకు. జ్ఞానులు, వయసులో పెద్దవారు అయినవారి మాటలు శ్రద్ధగా విను. ఎందుకంటే వారి అనుభవం వలన నీకు ఏ కొంచెమైన మేలు జరుగవచ్చును.

**మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ, అతిథి దేవోభవ :**

జ్ఞానంలోను, వయస్సులోను పెద్దలయిన వారు నీకు సంబంధించినవారు కాకపోయినా దేవతలు, పితరులు అన్నారు. సంబంధించిన వారు అయితే వారిని ఈ వాక్యంలో తల్లిదండ్రులు, ఆచార్యుడు, అతిధి వరుసలో లెక్కించబడతారు. తల్లిదండ్రులు జన్మనిచ్చినవారు కనుక సంబంధించినవారే. ఆచార్యుడు రెండవ జన్మ నిచ్చినందులకు బంధుశ్రేణిలోకి చేరతాడు. అతిధి మన ఇంటికి వచ్చినపుడు మన కుటుంబములోని వానిగా భావించి ఆదరించాలి. అప్పుడప్పుడు మన కుటుంబ సభ్యులకంటె ఎక్కువగా ఆదరించాలి. ఈ నలుగురి విషయంలో ఆచార్యుడు స్నాతకునితో అంటాడు. వీరిని దేవతలుగా భావించి, గౌరవించు, తల్లి నిన్ను నవమాసాలు మోసి కన్నది. తండ్రి నీ పోషణ చేశాడు. ఆచార్యుడు నీకు విద్య నేర్పి మనిషిగా చేశాడు. అతిధిని నీ తల్లిదండ్రులు కూడ నెత్తిన పెట్టుకుంటారు. ఇందువలన వీరినందరిని దేవతలతో సమానంగా భావించు. నీవు ఒకప్పుడు తండ్రివి కావచ్చు. నీకు సంతానం కలుగుతుంది. నీ భార్య అతనికి తల్లి అవుతుంది. నీవు ఎప్పుడైన అతిధిగా ఎవరింటికైనా వెళ్లవచ్చు. నీవు ఇపుడు వీరందరిని దేవతలుగా భావించితే నీ సంతానం కూడ నిన్ను అలాగే భావించి గౌరవిస్తుంది. గృహస్థ

ధర్మంలోని ఈ క్రమము వైదికధర్మంలోని విడదీయరాని భాగము. దీనిని నీవు పాటించాలి. ఈ విధంగా ఈ క్రమం సంతానం నుండి సంతానానికి కొనసాగుతూ ఉంటుంది.

**యాని అనవద్యాని కర్మాణి, తాని సేవితవ్యాని నో ఇతరాణి :**

సమాజంలో అన్ని రకాల మనుష్యులున్నారని గురువు చెబుతున్నాడు. మేము నీతో నీకంటె పెద్దవారి మాటలు ధ్యానంగా వినమని, వారి మార్గాన నడవమని చెబుతున్నాము. దేవతలున్నారు. పితరులున్నారు, ఆచార్యులున్నారు, అతిధులున్నారు. వీరందరిన పెద్దలనుకుని నడవమని చెబుతున్నాము. కాని వీరు చెప్పే మాటలలో వినదగిన మాటనే వినుము. వీరి ఆచరణ ఆచరింపదగినదానినే అనుసరించుము. వీరు చెప్పేదాంట్లో ఏదైనా చెడు విషయం ఉంటే దానిని తిరస్కరించుము. ఈ విషయం ఆచార్యుడు ఇతరుల విషయంలోనే చెప్పడంలేదు, తన విషయంలో కూడా ఇదే చెబుతున్నాడు.

**యాని అస్మాకం సూచరితాని త్వయా ఉపాస్యాని నో ఇతరాణి :**

మా విషయంలో కూడ అంటే ఆచార్యుల మంచి పనులనే అనుసరించును. ఆచార్యుడు చెడు చెప్పినా, చేసినా తిరస్కరించుము. తన ఆచరణ విషయంలో పూర్తి విశ్వాసమున్న గురువే తన ముఖంగా ఇలాంటి మాటలు చెప్పగలడు.

**యేకే చాన్మత్ శ్రేయాంస: బ్రామ్మణా: తేషాం త్వయాసనేమప్రశ్వసీతవ్యం :**

మేము పైన చాలామందిని లెక్కించాము. వారికంటె మించిన గొప్పవారుంటే వారి దగ్గర కూర్చో. ఇలాంటి వారి మధ్యలోనే మెలగుము. మానవుడు ఎలాంటి వాతావరణంలో నివసిస్తున్నాడో, గాలి పీలుస్తున్నాడో, కూర్చొనుచూ లేస్తూ ఉంటాడో దాని ప్రభావం బాగా పడుతుంది. ఎపుడూ మరిచిపోయి కూడ చెడు వాతావరణంలోనికి పోవద్దు. ఎందుకంటె అక్కడి వాతావరణమే మురికి వాసనలు (భావాలతో) తో నిండి వుంటుంది. మహాత్ములుండేచోట వాతావరణం శుద్ధంగా, పవిత్రంగా ఉంటుంది. త్రాగుబోతులు, దురాచారులు ఉన్నచోట వాతావరణమే మానవుని చెడు భావాలు కలగటానికి కారణమవుతుంది. ఇందువలన ఉన్నత భావాలు, ఆచరణలు గల వారిని వెతికి వెతికి వారి ఆశీర్వాదాలను పొందటానికి ప్రయత్నించుము.

**శ్రద్ధయాదేయం అశ్రద్ధయాదేయం :**

నీవు ధనం సంపాదింపసాగినపుడు ఏ పనిలో నీకు శ్రద్ధ ఉంటుందో దానికి శక్తికొలది దానం చేయ. శ్రద్ధ లేకపోయినా కూడ ఇవ్వు. ఎందుకంటే నీకు శ్రద్ధ లేని కార్యము కూడ మంచిదే కావచ్చు. అదిగాక ధనము, సంపద ఏమిటి? ఎవరిది? ధనమనేది ఏదైనా పనికి ఉపయోగించినపుడే అది ధనమనబడుతుంది. వేరువిధంగా ధనం రాయిరప్పలతో సమానం. ఏ పనికీ ఉపయోగించినపుడు ధనం ధనమనిపించుకోదు. నీ అవసరాలు తీరిన తరువాత శ్రద్ధతో గాని, అశ్రద్ధతో గాని ఏ విధంగానైనా సరే దానం చేయి. దానం చేయడం వలన ధనం తరిగిపోదు.

**శ్రియాదేయం హ్రియాదేయం భియాదేయం సంవిదాదేయం :**

మానవుని దగ్గర అవసరానికి మించి ఉన్న ధనము తనకు ఉపయోగపడనపుడు సమాజానికి దానిని ఉపయోగించాలి. ఊరకనే ఉంచకూడదు. నీవు ధనవంతుడవు అయితే, అంతులేని ధనం వచ్చివుంటే ఆ ధనం సమాజం నుండే వచ్చిందని తెలుసుకో. నీ శ్రమ వలన వచ్చినప్పటికీ నీవు ఆ ధనానికి ధర్మకర్తవు. ఇందువలన ధనం పెరిగింది. పెరగడం వలన దానం చేయి. శ్రియాదేయం – పెరిగినా కూడ మనసు ఒప్పుకోకపోతే, సిగ్గుతోనయినా దానం చేయి. హ్రియాదేయం – జనులు ఏమనుకుంటారు? ఇంత ధనం సంపాదించి పాము లాగ దానిపై చుట్టువేసుకొని కూర్చున్నావు. సిగ్గుతో ఇవ్వలేకపోతే భయంతోనయినా ఇవ్వు. భియాదేయం – ఇందువలన భయంతో ఇవ్వు. ఎందుకంటే సమాజంలో చాలామంది డబ్బు ఒకచోట పోగుచేసి ఉండటం చూడలేరు.

## 13. వివాహ సంస్కారము

స్త్రీకి 18 సంవత్సరాలు, పురుషునకు 21 సంవత్సరాలు నిండిన పిదప సమాన గుణ కర్మ స్వభావాలు గల స్త్రీ పురుషులు ఎవరి బలాత్కారం లేకుండా స్వయంగా వరించి (ఇష్టపడి) ఒక ఇంటివారు అవుతారు. ఆ సమయంలో పెద్దల సమక్షంలో అగ్నిహోత్రం ఎదుట ఇద్దరూ ఒకరినొకరు ప్రతిజ్ఞలు, ప్రమాణాలు, వాగ్దానాలు చేసుకుంటారు.

వేదమంత్రాల సాక్షిగా, పంచభూతాల సాక్షిగా ఒక్కటవుతారు. అక్కడ బ్రాహ్మణులు, పెద్దలు అనుకుంటారు. మేము వాళ్ళిద్దరిని ఒకటి చేశామని, కానీ వాళ్ళిద్దరిని వారు

ఒకటి చేయలేదు. అది దైవ నిర్ణయము. ఆ అమ్మాయి, ఆ అబ్బాయిని పూర్తిగా నమ్మింది. నా 18 సంవత్సరాల శరీరాన్ని నా 120 సంవత్సరాల ఆయుష్షును నా 16 కళలను, నా ప్రేమని, నా మనస్సును నేను అర్పిస్తున్నాను. అని అబ్బాయికి అర్పించి తన చిటికిన వేలు పట్టుకుని అగ్నిగుండం చుట్టూ 7 అడుగులు నడుస్తూ కన్న అమ్మానాన్నలను వదిలేసి, పుట్టిన ఊరును వదిలి, చిన్ననాటి స్నేహితులను, బంధుమిత్రులను వదిలి, నీకోసం నేను వస్తున్నానంటూ ఇంటి పేరుతో సహా మార్చుకుని చిటికిన వేలు పట్టుకుని అగ్నిగుండం చుట్టూ 7 అడుగులు వేసి తాళి కట్టించుకుని కన్నీళ్ళతో కన్నవాళ్ళకి వీడ్కోలు చెపుతూ ఆశల పల్లకిలో భర్తను ఆహ్వానిస్తూ భర్త అడుగులో అడుగు వేస్తూ నీ వెనకాల నేనున్నాను అని ధైర్యం ఇస్తూ ఈరోజు నుండి నువ్వే నేను, నేనే నువ్వు, శరీరాలు రెండూ వేరైనా మనస్సు ఒక్కటేనని ఈ శరీరంతో సహా నీకు అర్పిస్తున్నానని భర్తకు సర్వం అర్పిస్తుంది భార్య.

అబ్బాయి కూడా తన జీవితంలోకి భార్యను ఆహ్వానిస్తూ నా చుట్టూ ఎందరున్నా నా వాళ్ళు ఎందరున్నా మొదటి ప్రాధాన్యత నీకే ఇస్తానని, నీ కన్నవాళ్ళ ప్రేమని, నీ తోబుట్టువుల ప్రేమ, నీ చిన్ననాటి స్నేహితుల ప్రేమని నేనొక్కడినే పంచుతానని అగ్నిసాక్షిగా ప్రమాణం చేసి, పంచభూతాల సాక్షిగా ఏడు అడుగులు వేసి వేదమంత్రాల సాక్షిగా మూడు ముళ్ళు వేసి ఇతని చిటికన వేలుతో అమ్మాయి చిటికిన వేలు పట్టుకుని తన జీవితానికి అమ్మాయిని ఆహ్వానించుకుంటాడు. గమనిక : ఈరోజు నుంచి ఏ రోజు (క్షణం) అయినా వ్యతిరేకం అయితే నేను చనిపోయిన వాడితో సమానం అని ప్రమాణం చేస్తాడు. ఈ ప్రమాణం ఎప్పుడు, ఎక్కడ చేస్తాడంటే వేదమంత్రాలతో ఈ ప్రమాణం వున్నది. ప్రమాణం చేసి భార్యను తన జీవితంలోకి ఆహ్వానిస్తాడు. తన జీవితంలోకి ఆహ్వానించి అన్నం తినేటప్పుడు అన్నాచెల్లెళ్ళా, బయటకు వెళ్ళినపుడు స్నేహితుల్లా, ఏదైనా ఒక బాధ్యత అప్పగించేటప్పుడు ఒక తండ్రిలా, పడుకునేటపుడు ఆ అమ్మాయిని గుండెల మీద పడుకోబెట్టుకుని జీవితాన్ని కొనసాగిస్తాడు. శరీరాలు రెండూ వేరైనా ఒకే కోరిక వుంటుంది. నిత్యం నీతోనే అని భర్త భార్యను పసిపిల్లలా చూసుకుంటూ భార్య అలిగినపుడు భర్త ఒక తండ్రిలా బుజ్జగించి లాలిస్తాడు. భార్యకు జ్వరం వచ్చినపుడు భర్త ఒళ్లో తన తల్లిలా పడుకోబెట్టుకుంటాడు. 24 గంటలు ఒక వైద్యుడిలా తన రక్షణకోసం 24 గంటలు

ఒక రక్షకుడిలా నిలబడతాడు. జ్వరం వచ్చిన భార్య నాకు అన్నం వద్దు అంటే అన్నం కలిపి చందమామ కథలు చెపుతూ పసిపిల్లవాడికి తినిపించినట్లు గోరుముద్దలు కలిపి తినిపిస్తాడు. "ధర్మ, అర్థ, కామ, మోక్షనా".

"ధర్మం" – ధర్మంగా నడుచుకుంటూ సంపాదిస్తూ తల్లిదండ్రులకు, సమాజానికి కావలసిన ధర్మం పాటిస్తాడు.

"అర్థ" – కట్టుకున్న భార్యను అర్థం చేసుకుని కడుపులో పుట్టిన కూతిరిలా తనను కాపాడుకుంటూ పూర్తి ప్రేమను పంచి చివరి శ్వాస వదిలే వరకు తన గుండెల మీద భార్యను పెట్టుకుంటాడు.

"కామము" – కాము అంటే సంసారం, మంచి సంతానం కొరకు శుభ ముహూర్తం లో దాంపత్య జీవితాన్ని అనుభవించి మంచి సంతానాన్ని ప్రపంచానికి ఇవ్వడమే నిజమైన సంసారం.

"మోక్షము" – మన పిల్లలు పెద్దవాళ్ళు అయిన తర్వాత మన బాధ్యత మొత్తం అప్పగించే వాళ్ళు బ్రతకడానికి దారి చూపించి, తన భార్యను తీసుకుని సన్యాసాశ్రమంకు వెళ్ళి సన్యాసం స్వీకరించి భార్యాభర్తలు ఇరువురూ కలిసి మోక్షంకోసం సాధన చేయడమే "మోక్షము".

ఈ ధర్మ, అర్థ, కామ, మోక్షములకు అర్థం ఏది.

గృహస్థ ధర్మంలో ఉన్నంత వరకు తన భార్యను ఒక పసిపిల్లలా చూసుకోవడం భర్త ధర్మం. బయటనుంచి వచ్చిన భర్తకి భార్య ఒక గ్లాసు నీరిచ్చి తన చీరకొంగుతో తన భర్త చెమటను తుడిచి ఒక తల్లిగా కూర్చోబెట్టి తన మనసులో ఉన్న బరువును దింపుతుంది. భర్తకు సబ్బుపెట్టి స్నానం చేయిస్తూ పసిపిల్లవాడిలా చూసుకుంటుంది. తనకు తల్లిగా వుంటుంది. ప్లేటులో అన్నం పెట్టి గోరుముద్దలు తినిపిస్తూ తల్లి అని నిరూపిస్తుంది. భార్య పడకగదిలో రతిక్రియ జరిగేటపుడు తన సిగ్గు మొత్తం వదులుకుని సంభోగంలోనే తన భర్తకు సమాధి స్థితిని చూపిస్తుంది. స్వర్గపు అంచుల్ని తాకిస్తుంది, ప్రపంచాన్ని మైమరిపిస్తుంది. ఒక రంభ, ఊర్వశిలా సుఖాన్ని అందిస్తుంది. తన గుండెల మీద భర్త తల పెట్టుకుని పడుకుంటుంది. భర్త ఏదైనా వ్యాపారం చేసేటపుడు ఒక స్నేహితురాలిగా సలహాలిస్తూ

తన ప్రక్కన ఉండి, ధైర్యాన్ని అందిస్తుంది. భర్తకు ఆపద కలిగినపుడు లేదా ఆరోగ్యం బాగాలేక మంచం మీద పడుకున్నపుడు తన కన్నీళ్ళతో శివలింగానికి అభిషేకం చేస్తుంది. తన బాధతో ఆదిపరాశక్తిని ప్రత్యక్షం చేసుకుంటుంది. కన్నతల్లికి మించి సేవ చేస్తుంది. తన కంటికి రెప్పలా కాపాడుకుంటుంది. అనురాగంగా ముద్దలు తినిపిస్తుంది. ఆత్మీయతతో తన భర్త మెడలో పూలమాలగా అల్లుకుంటుంది. ప్రతిక్షణం ప్రక్కనే ఉంటుంది. తన భర్తకు శ్రీరామరక్ష అవుతుంది. మళ్ళీ భర్తను మామూలు మనిషిగా చేసుకుంటుంది. తన మాంగళ్యంను కాపాడుకుంటుంది. ఇంటినిండా పిల్లలు పుట్టిన తన భర్త మీద ప్రేమ ఇంచైనా తగ్గదు. బాధ్యతలు ఎన్ని పెరిగినా తన బాధ్యత మరిచిపోదు భార్య.

భార్యాభర్తల బంధాల గురించి వేదంలో చెప్పినట్లు వర్ణించి వ్రాయాలంటే ప్రేమను ఇంకుగా చేసి నా మనసును కలాన్ని చేసి సప్త సముద్రాలను కాగితాలుగా చేసి వ్రాసినా సరిపోదు.

**సుగుణ ఖండించిన వివాహ వ్యవస్థ :**

ప్రపంచంలో ఇన్ని దేశాలు ఉన్నా మన దేశాన్ని ఎందుకు గౌరవిస్తున్నాము, ఇతర దేశాలు అంటే ఈ వివాహ వ్యవస్థను గౌరవించి ఒక అమ్మాయి, ఒక అబ్బాయిని వివాహం చేసుకుని జీవితాంతం కలిసి ఉంటుంది అని మన దేశాన్ని గౌరవిస్తున్నారు. అదే విదేశాలలో అగ్రిమెంటు మ్యారేజీలు ఉంటున్నాయి. కాబట్టి కేవలం వివాహ వ్యవస్థకే గౌరవం ఇస్తుంది. కానీ ఈ రోజుల్లో మన భారతీయులే మన వివాహ వ్యవస్థను గౌరవించడం లేదు. మనకు స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత రాజ్యాంగం వచ్చింది. రాజ్యాంగం వచ్చిన తర్వాతనే ఈ కోర్టులు, ఈ విడాకులు వచ్చాయి. అంతకు ముందు విడాకులు అంటే మన భారతీయులకు తెలియదు. మనది ఋషి సాంప్రదాయం. లక్షల సంవత్సరాల నుండి మన ఋషి సాంప్రదాయం కొనసాగుతోంది. ఈరోజు విజ్ఞానం పెరిగి అజ్ఞానులై బంధాలను వదులుకుంటున్నారు. భార్యాభర్తల సంబంధానికి అర్థం తెలుపకుండా జీవిస్తున్నారు. ఒక వ్యాపారంలో వ్యాపారవేత్తతో ఎలా ఉంటారో, ఇంట్లో భార్యాభర్తలు ఇద్దరూ నీ జీతం ఇంత ఇవ్వు, నా జీతం ఇంత ఇస్తా అని, నువ్వు ఇంటి అద్దె కట్టు, నేను ఇంట్లో సరుకులు తీసుకొస్తా అని ఒక వ్యాపారుల్లా బ్రతుకుతున్నారు. భార్యాభర్తల

సంబంధాలకు ఒక కొత్త పేరు కూడా పెట్టారయ్యా. లైఫ్ పార్టనర్ అంటే జీవిత భాగస్వామి అని అర్థం. ఇందాక వేదంలో ఏమని రాసారు ఇద్దరూ ఒక్కటే. కానీ ఇక్కడ జీవిత భాగస్వామ్యం. భర్త జీవితంలో ఒక భాగంగానే భార్య అని వాళ్ళు నిర్ణయించుకున్నారు. తన భాగాన్ని తను ఎప్పుడైనా తెంచుకోవచ్చు అని కొత్త రూల్స్ పెట్టారు. నచ్చితే వుండవచ్చు, నచ్చకపోతే విడాకుల మీద సంతకం పెట్టు, నీకు ఇంత డబ్బు ఇస్తా. ఫ్రీడం లైఫ్ కావాలని ఒక కొత్త పద్ధతిని మన భారతదేశంలో అమలుపరిచారు. ఈరోజు భార్యాభర్తల సంబంధానికి అర్థంలేకుండా చేశారు. ఈరోజు మన భారతదేశంలో ఉన్న కోర్టుల్లో ఒక 30% విడాకులకోసం ఎదురుచూసే వాళ్ళున్నారు. ఒక 30% ఇష్టం లేకపోయినా కలిసి బతుకుతున్నారు. తప్పుదు జీవితం అని బ్రతికేవాళ్ళు ఒక 20% భర్తను వదిలేసి ఇంటికి వెళితే నా తల్లిదండ్రులకు బరువైపోతాను, సమాజం నన్ను ఛీ కొడుతుంది అని సంసారం చేసే వాళ్ళూ ఉన్నారు. ఒక 3% అయితే నాకు భర్త వద్దు, ఎవరూ వద్దు, నా బ్రతుకు నేను బ్రతుకుతా అని వెళ్ళిపోయిన వాళ్ళున్నారు. ఒక 17% పల్లెటూళ్ళలో ఉన్నవారు ఎంతో కొంత ఆధ్యాత్మిక జ్ఞానం ఉన్నవాళ్ళు ఎంతో కొంత బాధ్యత ఉన్నవాళ్ళు కొంత ప్రశాంతమైన జీవితాలు గడుపుతున్నారు.

**కామమును ఖండించిన సుగుణ :**

ఇందాక మనం చెప్పుకున్నాము. ధర్మ, అర్థ, కామ, మోక్షమని, కామాన్ని మంచి సంతానం కోసం ఉపయోగించాలి. లేదా కామ కోరికలు ఎక్కువగా ఉంటే తన భార్యతో అనుభవిస్తూ ఉంటే అది ధర్మం. ఇతర స్త్రీని మనసులో తలచుకున్న అది అధర్మం అని మన గురువులు చెప్పారు, మన వేదం చెప్పింది. ఈరోజు నేను భారతదేశాన్ని చూస్తుంటే నా మనస్సు బాధతో కన్నీరు చుక్క నేలమీద రాలుస్తోంది. నేను భారతదేశ చరిత్రలు చదువుతున్నప్పుడు నా మనస్సు ఆనంద సాగరాలు దాటింది. ఇంత గొప్ప దేశంలో జన్మించిన రాముడు, కృష్ణుడు, సత్యహరిశ్చంద్రుడు, సప్తఋషులు, వ్యాస మహర్షి, సూత మహర్షి, పుణ్యనదియైన గంగా, ఉత్తరాన హిమగిరి శిఖరం, నవబ్రహ్మలు, సత్యవంతుడు కథలు, మహాభారతం వీటన్నింటి గురించి తలచుకుంటే మన భారతదేశంలో జన్మించి నందుకు నేను గర్వపడుతున్నాను. జ్ఞానాన్ని అందించడానికి మన గురువులు మనకు అందించిన జ్ఞాన భండార గ్రంథాలు ఎన్నో. 4 వేదాలు, 6 శాస్త్రాలు, 18 పురాణాలు, 108 ఉపనిషత్తులు, భగవద్గీత, వశిష్ఠ గీత, అష్టవక్ర గీత ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్నో

గ్రంథాలు ఎంతో మంది భక్తులు జన్మించిన గడ్డ మన భారతదేశం. మీరాబాయి, ప్రేమతో భక్త కన్నప్ప, త్యాగంతో వృద్ధ శబరి, ఎదురుచూపుతో గురునానక్, కబీర్‌దాస్, తులసీదాసు, రామకృష్ణ పరమహంస, వివేకానంద, యోగానంద, పరమహంస, మహావతార బాబాజీ, లహరి, మహాశయులు జగద్గురు ఆది శంకరాచార్యులు, ఇలా చెప్పుకుంటూ పోతే మన భారతదేశంలో జన్మించిన మహానుభావులు ఎందరో ఎందరెందరో. ఇంత మంచి గడ్డమీద నేను పుట్టానే అని ఆనందంతో హిమగిరి శిఖరాన చిందులేసి, చిట్టితల్లి గంగ ఒడిలో ఆటలు ఆడుకుని అల్లరెంతో చేసి ఆనందంతో ఉప్పొంగిపోయాను. కానీ ఈరోజు ఏవైపు వెళుతోంది నా భారతదేశం, ఏమై పోతున్నారు నా భారతీయులు. నేటి బాలురే రేపటి పౌరులు అని అన్న మాటలు. ఈరోజు ఉన్న యువత ఏ వైపు వెళుతోంది. రేపటి భారతదేశం ఏమై పోతోంది. ఆత్మీయతలు మరిచిపోయి అనురాగాలు తెంచుకుని కళ్ళనిండా కామంతో వావివరుసలు మరిచిపోయి, కుక్కల కన్నా హీనంగా అర్థరాత్రి నడిరోడ్డు మీద పసిపిల్ల దొరికినా కూడా కామంతో ఆ పిల్లను నలిపేస్తున్నారే. నరరూప రాక్షసులు జన్మిస్తూ భారతదేశపు రాజధాని నడిబొడ్డున అభాగ్యులైన నిర్భయను కామంతో తన జీవితాన్ని తుంచేసినారే. విజయవాడ నడిబొడ్డున పాఠశాలలో పరీక్ష రాస్తున్న శ్రీలక్ష్మిని నరికేశారే, రక్తపు మడుగులో పడేసారే. ఆంధ్రప్రదేశ్ రాజధాని హైదరాబాద్ నడిబొడ్డున కన్నతండ్రి కామంతో కన్న కూతుర్ని నలిపేశాడే. విప్పనా భారతదేశ నేరచరిత్ర, చూపనా కామాందులెందరినో. మార్చేది ఎవరు, మారేది ఎవరు. ఇంకెంతమందిని కామాంధులకు బలివ్వాలి.

భారతదేశంలో ఆడపిల్లల్ని కనాలంటే భయపడే తల్లిదండ్రులను చూపించమంటారా! భారత స్త్రీని ఆదిపరాశక్తిగా వర్ణించారే, భారతమాతగా గౌరవించారే, ఏమైంది ఆ గౌరవం. భారత చరిత్ర, రక్తంతో కామసూత్రాలు వ్రాసుకుంటున్నారే. సెల్‌ఫోన్‌లో అశ్లీల చిత్రాలు చూస్తున్నారే. పెళ్ళికి ముందు ప్రేమ పేరుతో ఇంటి గడప దాటుతున్నారే. గుట్టుచప్పుడు కాకుండా పిల్లల్ని కంటున్నారు. చెత్తకుప్పల్లో పడవేస్తున్నారు. సరైన మార్గదర్శులేక చెప్పిన వారి మాటలు వినక మీ ఇష్టంగా జీవిస్తున్నారు. ఈరోజు వేదం మౌనం అయింది. మహర్షులు దూరం అయినారు. మంత్రాలు శూన్యం అయినాయి. మరొక కొత్త కంప్యూటర్ యుగాన్ని వ్రాసుకుంటున్నారే, వ్రాసుకోండి. కొత్త యుగాన్ని సృష్టించుకుంటున్నారే సృష్టించుకోండి.

# 14. వానప్రస్థము

ఈనాడు మనము గృహస్థ జీవితం చిక్కులలోనుండి బయటకు రావడానికి ఏడుస్తున్నాము. ఎక్కువమంది ఇందులోనే పడివుండి తమ జీవితాన్ని ముగిస్తున్నారు. ఏ మానవుడు 'ఆశ్రమ' శబ్దాన్ని ప్రయోగించాడో అతడు గొప్ప ఉద్దేశ్యంతో ఈ శబ్దాన్ని ప్రయోగించాడు. 'గృహస్థ' ఒక ఆశ్రమం. ఒక విడిది. వైదిక కాలపు పురుషులు జీవితాన్ని ఒక యాత్రగా భావించారు. ఆ యాత్రకు నాలుగు విడుదులు ఏర్పరచారు. యాత్రలో బ్రహ్మచర్యాశ్రమాన్ని మొదటి విడిదిగా భావించారు. ఆ తరువాత గృహస్థుని యాత్ర. కాని దీని తరువాత మరొక మజిలీ ఉంది. గృహస్థుడు గృహస్థాశ్రమాన్ని విడిచి ముందుకెళ్లేవాడు. నేడు మనం ఈ ఆశ్రమ శబ్దం యొక్క అర్థాన్నే మరచిపోయాము. గృహస్థాశ్రమంలో ప్రవేశించి, అందులోనుండి బయటకు వచ్చే పేరే వానప్రస్థము. మనం చిరకాలం ఇందులోనే పాతుకొని ఉంటామన్నట్లుగా ఉండాలి. జీవిత బీమా 30, 35 సంవత్సరాలుంటుంది. కాని మనం మన మనస్సులో మనమిక చావమేమో అన్నట్లుగా భీమా చేసుకున్నాము.

గృహాశ్రమంలో పడి దానిలోనుండి బయుటకు రావాలనే విషయాన్ని మరచిపోతున్నాము. ఇక్కడికి వచ్చినవాడు తిరిగి వెళతాడు. కాని గృహాశ్రమము ఒక చక్రవ్యూహము. దానిలో అభిమన్యునిలాగ ప్రవేశస్తారు గాని తిరిగి రాలేకపోతున్నారు. మనము చివరిదాక లోకచింతన చేస్తుంటాము. వైదిక సంస్కృతిని స్వీకరించినవారు 50 సంవత్సరాల వయస్సులో ఇల్లు వాకిలి భార్యను కొడుకులకు వదిలిపెట్టి జీవిత యాత్రకు ముందరి మార్గాన వెళ్లేవారు. నేడు అలా చేయడంలేదు. సత్రానికి ఒక నియమం వుంటుంది. అందులో 4 లేక 5 రోజులు ఉండవచ్చును. సత్రంలో అంతకంటె ఎక్కువ రోజులుంటే సత్రపు గుమస్తా మొదట సంకేతంగా చెపుతాడు. ఎదురతిరిగితే ఎవడైనా వాని సామాను ఎత్తి బయట పారవేస్తాడు. జీవితము ఒక యాత్ర. ఇందులో మనము ముందుకు పోతూ ఉండవలసినదే మనకి ఇష్టమయినా, ఇష్టము కాకపోయినా, ఏ పెద్దమనుషులు గృహస్థాశ్రమం తర్వాత స్వయంగా ముందుకు వెళ్లిపోయారో వారి గౌరవము, ప్రతిష్ఠ నిలిచి ఉంటవి. ఎవరు అలా చేయరో వారిని సత్రం యజమాని ఒక్క తోపుతో బయటకు నెట్టివేస్తాడు. ఈనాడు గృహస్థుడు వయసులో ముందుకు వెళ్లవలసినవారే.

వారు ఒకసారి తమ లోపలకు చూచుకుంటేసరి, వారియెడల ఇలాంటి వ్యవహారమే జరగడంలేదా? వారిని వారి పిల్లలే, కోడండ్రే 'ఈ ముసలి చావడు, బ్రతుకుడు' అని తిడుతూ ఉంటారు. కోడండ్రకు తమ అత్తలతో ఎందుకు పడదు? ఎందుకంటే అత్త ఇంట్లో ఆమె కోడలా అన్నట్లు ఇంట్లో పెత్తనం చేస్తుంది. వృద్ధాప్యంలో తండ్రితో కొడుకులకు ఎందుకు పడదు? ఎందుకంటే తండ్రి చివరి ఊపిరిదాక పడివుండి పిల్లలకు బరువైపోతున్నాడు. ఏ తల్లిదండ్రులు వారిని కనిపెంచారో వారు బరువైనా సంతానం వారికి సేవ చేయాలి. చివరకు తల్లిదండ్రుల ఋణం ఎవరు తీర్చుకుంటారు? కాని ఇది సంతాన కర్తవ్యమనుకుంటే ఎవనితోనయినా మా సేవ చేయడమే నీ కర్తవ్యము అని అంటే ఏం బాగుంటుంది? ఇందువలన ప్రాచీన ఋషులు సంతానం తల్లిదండ్రుల పితృ ఋణాన్ని తీర్చుకోవడానికి మరొక మార్గాన్ని చూపెట్టారు. తల్లిదండ్రులు వృద్ధులై ఇంటి వాకిట్లో కూర్చుంటే కొడుకులు వారిని పూజించాలి అని చెప్పలేదు. తల్లిదండ్రుల కర్తవ్యము గృహస్థాశ్రమం తరువాత వానప్రస్థానికి వెళ్లిపోవాలి. వారి సంతానము పితృ ఋణము తీర్చుకోవడానికి గృహస్థాశ్రమంలో చేరాలి. తమకంటె ఉత్తమ సంతానాన్ని ప్రపంచాని కివ్వటానికి ప్రయత్నించాలి. మానవుడు స్వాభావికంగా స్వతంత్రంగా ఉండగోరుతాడు. తల్లిదండ్రులు ఇంట్లోనే గూడుకట్టుకొని కూర్చుంటే వారి సంతానము ఇంట్లో స్వేచ్ఛగా వ్యవహరించే అవకాశం ఉండదు. ఇందువలననే ప్రపంచంలో ఎవరు అతి దగ్గరగా రావలసినవారో వారే అతి దూరంగా పోవలసి వస్తున్నది. తండ్రి కొడుకుల, అత్త కోడళ్ళ అరుపులు వినడానికి, కనటానికి, తమాషా చూడటానికి ఇరుగుపొరుగువారు గుంపులుగా గూడుతారు. తల్లిదండ్రులు తమ కాలంలో ఇంటికి యజమానులు. ఇపుడు వారు తమ సంతానానికి ఆ అవకాశము ఇవ్వాలి. కాని అధికారం అనే వస్తువు ఎవడు తన చేతిమీదుగా ఇతరులకివ్వటానికి తయారుగా ఉండదు. ఎవడైనా లాక్కుంటే సరే. కాని తన చేతులమీదుగా ఇచ్చేది ఎవరు? ఇందువలననే నేడు నాలుగు వైపుల తండ్రి కొడుకుల, అత్తాకోడళ్ల యుద్ధం కనబడుతుంది. ప్రాచీన ఋషులు వానప్రస్థ ఆశ్రమం ద్వారా ఈ సమస్యను పరిష్కరించారు. వారు చెప్పింది ఏమిటి? చివరకు ప్రపంచాన్ని వదిలిపెట్టక తప్పదు. తన్నులు తిని అగౌరవంగా వదిలిపెట్టే బదులు స్వయంగా ఎందుకు వదిలిపెట్టకూడదు? అలాగని ప్రపంచాన్ని అనుభవించాలని ప్రతివానికి ఉంటుంది.

ఇందువలన గృహాశ్రమంలో దానిని అనుభవించే అవకాశం ఇచ్చారు. కాని గృహస్థు తన అనుభవం వలన తెలుసుకుంటాడు ఈ భోగాలలో ఏమీ లేదని. ఇందువలన అతను స్వయంగా వాటికి విముఖుడు అవుతాడు. విశ్రమిస్తాడు. భోగం అనుభవించిన తరువాత భోగాన్ని వదిలిపెట్టడం తప్పనిసరి. మానవుని ఈ స్వాభావిక, మానసిక దశకే ప్రాచీన ఋషులు శాస్త్రీయ రూపమిచ్చారు. ఈ ప్రవృత్తి పేరే వానప్రస్థము అన్నారు. వానప్రస్థము ఒక సాధనా భావనా విశేషము. ప్రపంచ సుఖాలలో బంకలాగా అతుక్కుపోకుండా దాని ఆనందాన్ని అనుభవించాలి. తరువాత దాన్ని వదిలివేయాలి. ప్రపంచంలో ప్రవృత్తి, నివృత్తి రెండు ఉన్నవి. వాటి వాటి స్థానంలో రెండూ మంచివే. ప్రవృత్తిని శాస్త్రాలలో ప్రేయము అన్నారు. నివృత్తిని శ్రేయము అన్నారు. ప్రేయము తరువాత శ్రేయము రావలసిందే. ప్రపంచాన్ని భోగించిన తరువాత ప్రపంచాన్ని వదిలిపెట్టవలసిందే. అనుభవించిన తరువాత వదిలిపెట్టడం ప్రవృత్తి తరువాత నివృత్తియే వానప్రస్థ భావన. నేడు మన సమాజానికి వానప్రస్థ భావన అవసరము. నివృత్తి భావన అవసరము. అతుక్కుపోవటానికి బదులు విడిచిపెట్టడం నేర్చుకోవాలి. మనము చిన్న చిన్న విషయాలలో కూడ మన మాటే నెగ్గాలని పట్టుపడతాము. కొంతకాలం తరువాత మన ప్రతిష్ఠల సమస్యగా మారుతుంది. మనము ఏదైనా కుర్చీమీద కూర్చుంటే దానితో అతుక్కుపోతాము. ప్రధాని కుర్చీమీద కూర్చుంటే ప్రధాని పదవితో అతుక్కుపోతాడు. మంత్రి కుర్చీమీద కూర్చుంటే మంత్రి పదవితో అతుక్కుపోతాడు. చాలామంది ఈ కుర్చీలమీద నుండి లేవలేరు. ఎందుకంటే ఆ కుర్చీలు వారి శరీర భాగాలు అయిపోతవి.

20వ శతాబ్దంలో ఎన్నో కొత్త జబ్బులు వచ్చినవి అని జనులు చెపుతారు. ఇతర జబ్బులు కొత్తవో పాతవో గాని ఈ అంటుకుపోయే జబ్బు మాత్రం తప్పని సరిగా కొత్తదే. ఈ జబ్బు నుండి సమాజాన్ని కాపాడాలంటే ఒకే ఉపాయముంది. సమాజంలో వానప్రస్థ భావను మేల్కొల్పడం. వానప్రస్థము కేవలం అడవిలోనికి పారిపోవడం పేరు కాదు. వానప్రస్థం నివృత్తి. త్యాగము, అపరిగ్రహము పేరు. 'పరిగ్రహ' శబ్దము పరి+గ్రహముతో తయారయింది. 'పరి'కి అర్థము నాలుగు వైపుల నుండి, 'గ్రహ'కు అర్థము పట్టుకొనుట. పరిగ్రహం అంటే ప్రపంచానికి నాలుగు వైపుల నుండి అంటుకుపోవడం. వదిలించినా వదలకపోవడం. 'పరిగ్రహము'. దాన్ని సమయం వచ్చినాక స్వయంగా వదిలిపెట్టడం

అపరిగ్రహం. పండు పండిన తరువాత స్వయంగా ఊడి పడదా! వానప్రస్థ భావన పక్వమైనపుడు పండు కొమ్మ నుండి వేరైపోవడం. సమాజ సమస్యలపై ఎంతగా ఆలోచించినా ఒకే పరిణామము ఏర్పడుతుంది. ఈనాడు ప్రపంచానికి ఏదైనా సందేశము అవసరమున్నదంటే వానప్రస్థ త్యాగము నివృత్తి సందేశము. అలాగా త్యాగము నివ్వటం తప్పనిసరి. మనము వదలకపోయినా ప్రకృతి మననుండి వదిలిస్తుంది. మనము తొలగకపోతే ప్రకృతి తోపుతో మన అడ్డు తొలగిస్తుంది. ప్రపంచంలో అలా జరుగుచున్నది. అలా అవుతూనే ఉంటుంది. ఏదైనా సత్యాన్ని స్వయంగా వదిలిపెట్టడంలోను, చెవులు పట్టుకొని వెడల నడపటంలోను ఏ భేదము లేదా? విషయం ఒకటే, పరిణామం సత్రం వదలడం. కాని ఈ పరిణామాన్ని వైదిక సంస్కృతి వానప్రస్థ ఆశ్రమం ద్వారా ఎంతో తేలికగా పరిష్కరించింది.

వానప్రస్థ ఆశ్రమానికి అర్థము ఏమిటి? జీవితంలో ప్రయాణానికి ఢంకా మోగుతుందని తెలుసు. అపుడు మన ఎదుట రెండు దారులున్నవి. మనము 70, 80 సంవత్సరాల వయస్సులో ఏదో సమయాన మూటముల్లె సర్దుకొని ప్రయాణానికి సిద్ధంకావాలి. లేకపోతే ఎవడైన వచ్చి మనలను లాగి బయటకు నెట్టేవరకు కూర్చొని వుండాలి. ఎవడో వచ్చి బయటకు వెడలగొడితే, అప్పటిదాక కూర్చుని ఉంటే వాడు మొండివాడు, పిరికివాడు అవుతాడు. బుద్ధిమంతుడు కాదు. వానప్రస్థ ఆశ్రమాన్ని కల్పించినవారు ఒక విషయాన్ని అంగీకరించారు. ఇక్కడ నుండి వెళ్లడం తప్పదు. ఇవాళ కాకపోతే రేపు, రేపు కాకపోతే ఎల్లుండి. వెళ్లడం తప్పదనుకున్నపుడు కొరడా తీసుకొంటేనే వెళ్ళాలా? స్వయంగా వెళ్ల కూడదా? ఇందులో ఏది తెలివిగల పని? వానప్రస్థ ఆశ్రమం గతిలేక ప్రపంచాన్ని వదలడం కాదు, తన ఇష్టపూర్తిగా ప్రపంచాన్ని వదలడం. ఎవనికో భయపడి ప్రపంచాన్నుండి పారిపోవడం కాదు, తన ఇష్టంతో జీవిత యాత్రలో ముందుకు వెళ్లడం. విడిదిని ఇల్లు చేసుకొని కూర్చొని ఉండటం కాదు, ఒక విడిది నుండి రెండవ విడిదికి పోవటానికి తయారుకావడం. కానున్నది మన ఇష్టప్రకారం జరిగితే అందులో మనకెంత ఆనందం కలుగుతుంది. ప్రపంచాన్ని వదలవలసి వచ్చినపుడు మనం ఇష్టపూర్తిగా వదలడం ఎందుకు కూడదు? ఒక వేళ ప్రయత్నం చేస్తే ఎవడైనా ఈ ప్రపంచంలో శాశ్వతంగా ఉండగలిగితే ప్రపంచంతో అంటుకుపోయి ఉండటం బాగానే ఉంటుంది. కానీ ఇది అసంభవమనుకున్నపుడు తాను స్వయంగా ఎందుకు చేయకూడదు? ఎట్టి

పరిస్థితిలోనైనా కావలసిందేగదా! మానవుడు చనిపోతాడు. కాడులో కాలిపోతాడు. ఇలా అందరికి జరుగుతుంది. వైదిక ఆదర్శము బ్రతికి ఉండగానే తన చావును చూడగలగడం, బ్రతికుండగానే తాను కాడులో కాలిపోవడం చూడగలగాలి. వానప్రస్థము బ్రతికుండగానే చావడం, సన్యాసము బ్రతికుండగానే కాడులో కాలిపోవడం. గృహస్థులు అందరూ కాగలుగుతారు. కాని వైదిక జీవిత విధానంలో గార్హపత్యము కాక రెండు ఇతర ఆశ్రమాలు అందరికి అవసరమైనవి – బ్రహ్మచర్యము, వానప్రస్థము, గృహస్థానికి ముందు బ్రహ్మచర్యం అవసరము. గృహస్థము తరువాత వానప్రస్థము అవసరము. సన్యాసం అందరికీ కాదు. వానప్రస్థానికర్థము అన్ని సంబంధాలను, చుట్టరికాలను తెంచుకోవడం. 50 సంవత్సరాల వయసు తరువాత ఎవడికీ ఏ పదవీ ఇవ్వకూడదు. పార్లమెంటు మెంబరు గాని, సభా సొసైటీల ప్రధానులు, మంత్రులు గాని, ఇదే వానప్రస్థము. ఈ భావము సమాజంలో వ్యాపించితే కొట్లాటలన్నీ సమసిపోతవి. ఈ వాదాన్ని మేల్కొల్పటానికే మాటిమాటికి 'ఇదన్నమమ' చదివేది. నాదేమి లేదు, నాదేమి లేదు. ఇలా అభ్యాసము చేయబడుతుంది. వానప్రస్థ ఆశ్రమం యొక్క లక్ష్యము ఇదే.

## 15. సన్యాసాశ్రమ సంస్కారం

ఆధ్యాత్మికోన్నతిని పొందిన విద్వాంసులు (యోగ్యులు) దేశ సంచారం చేస్తూ ప్రజలకు ధర్మోపదేశం చేస్తూ ఉండాలి. అట్టి జీవితం గడపబోయే ముందు ఈ సంస్కారం చేసుకుంటారు. ఇది అందరూ చేసుకోనక్కర లేదు. అంతటి యోగ్యత, సామర్థ్యం కలవారే చేసుకోవాలి.

మన వేదంలో నిర్మించారు 4 ఆశ్రమాలని. ఆ 4 ఆశ్రమాలు బ్రహ్మచర్యాశ్రమం, గృహస్థాశ్రమము, వానప్రస్థాశ్రమము, సన్యాశ్రమము. మిగతా 3 ఆశ్రమాలలో కష్టం వుంటుంది. బ్రహ్మచర్యాశ్రమంలో బ్రహ్మముహూర్తంలో లేచి (3 గంటలకు) స్నానం చేసి గురువుగారు చెప్పినట్టు వింటూ, యజ్ఞానికి సమిధలు తెస్తూ, భిక్షాటన చేస్తూ గురువుగారి బట్టలుతుకుతూ జీవితం కొనసాగుతుంది.

గృహస్థాశ్రమంలో మీ అందరికీ తెలిసిందే సంసార సాగరం. వానప్రస్థాశ్రమం అంటే మన బాధ్యతను పిల్లలకు అప్పగించి ఉదయం, సాయంత్రం జపం చేస్తూ వాళ్ళ పిల్లలను ఎత్తుకుని మనవలు, మనవరాండ్రు వాళ్ళ పని వాళ్ళు చేసుకునేంత వరకు

మనం వాళ్ళతోనే ఉండటం ధర్మం. ఆ ధర్మాన్ని పాటించి సన్యాశ్రమం స్వీకరించే ముందు సన్యాసాన్ని స్వీకరించి బంధాలను బంధుత్వాలు తెంచుకుని వేదంలో చెప్పబడినట్టు మొదటి బంధం ఆశ. చివరి బంధం గురువు అనే వేద వాక్కును అనుసరించి ఆశను అగ్నికి ఆహుతిచ్చి హోమం చేసి సన్యాసాన్ని స్వీకరించే ఒక పారే నదిఒడ్డున పర్ణశాల కట్టుకుని, చుట్టూ పూలమొక్కలు పెట్టుకుని, ఓ 50 పావురాలు, ఓ 50 పిట్టలు, ఓ 4 నెమళ్ళు, ఓ 4 జింకలు, ఓ 4 ఆవుదూడలు ఆ పారే నదీతీరాన ప్రశాంతమైన జీవనం కొనసాగించడమే సన్యాస జీవితం. వీలైనంత దైవచింతనలో గడుపుతూ పారే నదీతీరాన ప్రకృతిలో చిట్టితల్లి గంగ ఒడిలో ప్రశాంతమైన జీవితం గడపడమే సన్యాసి జీవితం. సన్యాస ఆశ్రమంలో పూర్తిగా వివరించాను.

## 16. అంత్యేష్టి సంస్కారం

జీవుడు శరీరాన్ని వదిలి వెళ్ళిన తరువాత ఆ శరీరాన్ని దహనం చెయ్యాలి. ఇది అంతిమ సంస్కారం. మృత శరీరాన్ని కట్టెలపై పరుండబెట్టి దానిపై మూలిక ద్రవ్యాలను సాంబ్రాణి, గుగ్గిలము, కర్పూరం మొదలైన వాటిని చల్లి, ఆపైన కట్టెలను పేర్చాలి. అగ్నిని వెలిగించి వేదమంత్రాలు చదువుతూ అగ్నిహోత్రంతో ఆహుతిలిచ్చునట్లు నేతిని ఆహుతులుగా యివ్వాలి.

అన్ని ధర్మాలలో చివరి వీడ్కోలు అంత్యక్రియలు దైవ ప్రార్థనతో జరుగుతున్నాయి. మన వాళ్ళు మాత్రము కొందరు దహనం చేస్తారు. మరికొందరు సమాధి చేస్తారు. కన్నీళ్ళతో వీడ్కోలు చెప్తూతూ బాధతో దహనం చేస్తున్నారు. ఇంతకు ముందు నన్ను చాలామంది ప్రశ్నించారు. స్వామీజీ ముస్లింవారు నవాజు చేసి ఖురాన్ చదివి కొత్త బట్టలు వేసి సెంటు కొట్టి పవిత్రంగా తీసుకెళ్తారు. తీసుకెళ్ళేటపుడు ఏ ఒక్కరూ చూసి ఆ శవాన్ని కనీసం 2 అడుగులు అయినా మోస్తారు. క్రిస్టియన్స్ వారు అయినా దైవ సన్నిధిలో ప్రార్థనలు చేసి, బైబిల్ చదివి చివరి వీడ్కోలు చెబుతున్నారు అని నన్ను చాలామంది చాలా ప్రశ్నిస్తున్నారు.

మన వాళ్ళు చనిపోతే ఆ శవం ఎదురువస్తే అపశకునం అని అంటారు. ఎవరైనా చనిపోతే సంవత్సరం వరకు గుడికి వెళ్ళకూడదు అని అంటారు. అంటు, ముట్టు, మైల అని అంటారు. ఎందుకని, అది ఎంతవరకు నిజం అని ప్రశ్నించారు.

స్వామీజీ ఈ విధంగా జవాబిచ్చారు. నిజానికి మన ధర్మం గురించి మీకు తెలుసా!? ఒక మనిషి ప్రాణం పోయిన తర్వాత అక్కడికి భజన మండలి వారిని పిలిపించి భగవద్గీత శ్లోకాలు వినిపిస్తారు. అంత్యక్రియల సమయంలో మంచి సమిదలు వేసి సుగంధ ద్రవ్యాలు వేసి అంత్యక్రియ హోమం అని ఒక ప్రత్యేక హోమం ఉంటుంది. వేద మంత్రాలతో 5 గురు వైదికులతో అంత్యక్రియ హోమం చేయించి, ఆ హోమంలో వచ్చిన మంటతో ఆ శరీరాన్ని దహనం చేస్తారు. ఈ దహనం చేసిన రోజు నుంచి 9వ రోజు వరకు ఆ చనిపోయిన వారి పేరుమీద గరుడ పురాణం చెప్పాలి. 10వ రోజు నుండి ఏ ముట్టు ఉండదు, అంటుగాని, మైలగాని ఉండదు. 10వ రోజు ఇంట్లో గాయత్రీ హోమం చేసి గంగ నీటితో ఇల్లు శుద్ధి చేస్తారు. అప్పటినుండి ఏ గుడికైనా వెళ్ళొచ్చు, ఎక్కడికైనా వెళ్ళొచ్చు.

**స్వామీజీ ఖండించిన అంత్యక్రియలు :**

ఈరోజు ఎవరైనా చనిపోతే వాళ్ళ కుటుంబ సభ్యులు ముందుగా చేసే క్రియ ఏంటంటే 4 ఫుల్ బాటిల్స్, 5 వేల రూపాయల పటాసులు, బ్యాండ్ తీసుకువచ్చి మందు త్రాగి పటాసులు కాలుస్తూ కల్లు త్రాగిన కోతిలాగా ఆటలాడుతూ అర్థంపర్థం లేకుండా ఎవరి ఇష్టానుసారం వాళ్ళు నడుచుకుంటున్నారు.

ఒక్కరేమో శవాన్ని గంపలో కూర్చుండ బెట్టి తీసుకెళ్తారు. ఒక్కరేమో శవాన్ని సమాధి చేస్తారు. ఒక్కరేమో శవాన్ని తుమ్మ కట్టెలతో కిరోసిన్ పోసి కాలబెడతారు. ఎవరి ఇష్టానుసారం వారు నడుచుకుంటారు. మనకంటూ ఒక ధర్మం ఉంది. ఈ ధర్మాన్ని అనుసరిద్దాం అని ఒక్కరికి కూడా ఆలోచన కలగడంలేదు.

దయచేసి మిమ్మల్ని వేడుకుంటున్నాను, అంత్యక్రియలు బ్యాండ్ మేళంతో, పటాసులు కాలుస్తూ, మందు త్రాగి తీసుకువెళ్ళకండి. మన ధర్మాన్ని అనుసరించి నడవండి.

వేదంలో అంత్యక్రియల గురించి ఈవిధంగా గర్భిణీ స్త్రీలను విషపురుగులు కుట్టి చనిపోయిన వారు విషం త్రాగి చనిపోయిన వాళ్ళను, రాసపుండు వల్ల చనిపోయిన వారు ఎక్కువగా అనారోగ్యం వలన చనిపోయిన పసిపిల్లలు చనిపోయిన వారిని దహనం చేయకూడదు. ఎందుకంటే విషం త్రాగిన వారు విషపురుగు కుట్టి చనిపోయిన వారి శరీరం నిండా విషం ఉంటుంది. ఆ శరీరం దహనం చేస్తే విషం గాలిలో కలుస్తుంది.

ఆ గాలి పీల్చిన వారికి విచిత్రమైన జబ్బులు వస్తాయి. గర్భిణీ స్త్రీలు కూడా వాళ్ళ గర్భంలో రక్తం ముద్దయి ఉంటుంది. కనుక గర్భిణీ స్త్రీని దహనం చేసిన వాయువు కలుషితమవుతుంది. కొత్త జబ్బులకు కారణం అవుతుంది. కనుక విష ప్రయోగం వల్ల చనిపోయిన వారు అయినా గర్భిణీ స్త్రీలు అయినా చనిపోతే గొయ్యి తీసి వేపాకు, ఉప్పు, కర్పూరం, తులసి మొదలగునవి వేసి శవాన్ని పూడ్చి పెట్టాలి అని మన పూర్వీకులు సైన్స్ పరంగా అందించారు.

**అసుర్యా నానుతే లోకా అంధేన తమసావృతాః ।**
**తాంస్తే ప్రేత్యాభి గచ్ఛంతి యేకే చాత్మహనోజనాః ॥ (యజుర్వేదం 40.3)**

ఆత్మహత్య చేసుకొని ఈ జన్మలోని దుఃఖం నుండి రక్షించుకుందామని ప్రయత్నించే వాడు వచ్చే జన్మలో ఇంతకంటే భయంకర దుఃఖాన్ని అనుభవిస్తాడు. ఇది ప్రాచీన ఋషుల అభిప్రాయము.

పైన చెప్పినదాని కర్థము – ప్రాచీన కాలపు ఋషులు మానవ జీవితాన్ని ఒక విశాలమైన సమస్యగా భావించే వారు. దానిని పరిష్కరించటానికి వారు ఉన్నతోన్నతమైన తత్త్వవేత్తలను ఆదేశించారు. మానవ జీవిత సమస్యను వారు పరిష్కరించుకునే ప్రయత్నం చేయాలి.

